యుండును

— బుధుడుండిన —

స్వల్పము పిత్రార్జితముండును యౌవ్వనమున పితృహానియగును పనులుచాలా తెలిసి యుండును.

— గురుడుండిన —

ధనవంతుడైనను సేనానాయకుడైనను రాజమంత్రియైనను అగును

— శుక్రుడుండిన —

మాతామహులచే నైనను లేక అత్తవారివల్లనైనను మిక్కిలి శ్రమలుండును న్యాయసభ మూలముగ ఆదాయము కలుగును సోదరుడు సంపన్నుడగును.

— రాహుకేతువులుండిన —

సామాన్యప్రాయమునసోదర ద్వేషముకలుగును స్థిరమగుఆస్థియుండదు అధికారము చిక్కును ముదియందు చెడును బలహీనుడగును పిత్రార్జితము సామాన్యముగానుండును కురూపియగు భార్యయుండును.

— మేషము ౧౦యవ ఇంటిలోరవి యుండిన —

పిత్రార్జితము అధికముగ నుండును తల్లిదండ్రులు చాలాకాలము జీవింతురు అధికారుల కృపగలుగును కీర్తిల్లును పలుస్థళములలో ఆదాయముండును.

— చన్ద్రుడుండిన —

రాజ్ఞియగును లేక తత్తుల్యుడగును తనగౌరవమునకై పాటుబడును దుర్గుణములుండును చాల్పాచోట్లలో అధికారము చేయును లాభముండదు ముదిమియందు యశముండును స్థిరాస్తికలుగును.

—♦ కుజుడుండిన ♦—

మధ్యప్రాయమున శ్రమలుండును దినచర్యకై మిక్కిలి శ్రమించును చాలాచోట్లలో పనులు చేసినను ఫలించదు సౌఖ్యవంతులగు సోదరులుండురు శత్రుల వంచనవల్ల శ్రమనొందును.

—♦ బుధుడుండిద ♦—

గుణవంతులగు సోదరులుండురు దశాహైన్యము గౌరవమునకై పాటుబడును అధికజనులవల్ల పోషింపబడును కీర్తిసామాన్యమగును.



—[ గురుడుండిన ]—

చాల్పుకాలమువరకు రాజులకుండునట్టి యశస్సునుండుటచే ఆజ్ఞసల్పును ప్రాయమునందు ఇతర దేశాధికారియగును పండితుడును అదృష్టశాలి ముదిమినలోపించును.

—[ శుక్రుడుండిన )—

రత్నవ్యాపారుడగును మృదువాక్కు కళత్రబాధయు ముదిమియందు సామాన్యము శ్రమపడును.

—( శనియుండిన )—

యౌవ్వనమున హీనదశ ఆస్తివ్రయపర్చును లజ్జాహీనము నీచసాంగత్యము నీచకృత్యములుచేయును పొల్లుపలుకులుండును పనులయెడ నేర్పరియగును.

— ( రాహువు కేతువు లుండుటచే )—

యుద్ధమునందు లాభించును ప్రాయమునందు దినచర్యలోపించును వంచనయగును యశస్సునొందును.

( ౧౧ వ ఇల్లుయగు వృషభమున రవియుండిన )

అదృష్టహీనము సామాన్యజీవనము సోదరఆస్తిచిక్కును,

—( చన్ద్రుడుండిన )—

పంటఫలించును అభివృద్ధియగును పిరికి భీతియు అక్కచెల్లెండ్లువుందురు.

—( కుజుడుండిన )—

సోదరులుందురు చింతలును శ్రమలుండును యౌవ్వనమున పిత్రార్జితము చెడును మళ్లీదొరుకును అభివృద్ధియగును.

—( బుధుడుండిన )—

పిత్రార్జితముండదు నీచకృత్యమువల్ల ధనముకలుగును ముదిమివరకు స్థిరముండదు జ్ఞానియగును యోగి లేక అవధూతయగును.

—( గురుడుండిన )—

దరిద్రమగును గౌరవమునకై పాటుబడును ద్వితీయ వివాహము శ్రమజెందును

—( శుక్రుడుండిన )—

ఋణస్థుడగును భార్యమూలమున ఆస్తికలుగును సోదరీమణి అభి-

వృద్ధి ప్రథమభార్య హానిజెందును.

—[ శనియుండిన ]—

భ్రాతృహైన్యము వీరల ఆస్తియబ్బును ఇతర ఆస్తిదారుకాను అంత్యకాలమున అభివృద్ధియగును.

—( రాహుకేతువులుండిన )—

మధ్యప్రాయమున సోదరద్వేషమగు చిక్కులుండును ప్రత్యేకముగు జీవనాధారముండను ముదిమియందు పూర్వాధికారము చెడును బలహీనముండును పిత్రార్జితము లోపించి యుండును. కురూపియగు కళత్రముండును.

[ ౧౨ వ ఇల్లుయగు మిధునములో రవియుండుటచేత ]

పితార్జితముండదు బాల్యమునందు మాతాపిత్రాదుల హానియగును ఇతరదేశమున ఉద్యోగముచేయును మధ్యప్రాయమున రెండవ విధముగా జీవించును బీదయగును.

—( చన్ద్రుడుండిన )—

బలహీనుడు సుశయ్య మంచి ఆహారమును వొప్పకుండును తెల్యవాడు దూరదేశమునందు సంచరించును.

—[ కుజుడుండిన )—

పలుదేశసంచారియగును దుష్టుడగును మధ్యప్రాయమున అపకీర్తియగును.

—( బుధుడుండిన )—

నానాదేశమునందు పలువిధములగు పనులుచేయును అంతమున వ్యాపారముచేయును ధనమునకై విద్యను అమ్ముకునును ఉల్లాసియై ప్రజలయొక్క యశస్సుకోరును సహాయకారియగును.

—( గురుడుండిన )—

శాస్త్రమునందు నిపుణుడును ఉపాధ్యాయుడగును నిర్మలమనుస్సు సమయమందు సహాయముచేయును ఉపకారముచేయును తనలాభనష్టము లెక్కించుపడడు.

—( శుక్రుడుండిన )—

మంచివాహనములుండును ఉల్లాసముగనుండును సముద్రయానము చేయును భార్యమూలమున ఆస్తిదారుడును తార్కికమునందు వ్యాపారముండును



—( శనియుండిన )—

ఒకటేవ్యాపారమునందు నిలచియుండడు ఇతరదేశమునకు పోవుచుండును ఫలహీనమగును ఇతరదేశపురాజులవల్ల విరోధముగ భాషించును ప్రతిష్ఠహాని దరిద్రమైయుండును.

—[ రాహువుకేతువుండిన )—

జీవనమునకై ఇతరదేశమున కదుగును ప్రథమమందు శ్రమజెందును వెనుక మిక్కిలి సంతసిలును యావ్వనమున చేయబడు వ్యాపారము ముదిమియందుచేయబడు బీదయగును న్యాయశాస్త్రమూలమున ధనసంపాద్యగడుపును ముదిమినయశముండును చాలావరకు న్యాయశాస్త్రవాదములుండును అందులో జయము కల్గును.

—( ౫ సింహలగ్నముగురించి ]—

ఆహారప్రియుడగును భగవద్ధ్యానపరాయణుడును దాతయగును స్వార్థపరుడగును యోగమార్గము తెల్యును అంతరంగుడగును యవ్వనమందు బాల్యమునందు నిరోగియై రోగినియనియనుకనును తాను చేయబడు పనులయశ మిక్కిలిప్రేమించును జనసహాయముచేయును ౫, ౧౦, లేక ౨౭ సం॥ లు లేక నెలలలో జ్వరముండును.

—( సింహమున రవియుండిన ]—

అధికప్రాయము గలుగును నిడివిగల శరీరముగౌరవము తాపశరీరియు చురుకుగనుండును.

—[ చన్ద్రుడుండిన )—

మధ్యప్రాయమున సంచరించును స్వచ్ఛముగపలుకును ఉపన్యాసమున మించియుండును యావ్వనమున వ్యభిచారియగును సుకర్ముడగును. ఇతరమతమునకు సహాయముచేసినందున అపఖ్యాతియగును సామాన్యముగు నిడివియుండును కాముకుడగును.

—( కుజుడుండిన )—

అల్పప్రాయము యావ్వనమున శరీరముపై కురుపులుండును శరీరము అచ్చటచ్చటవికారమగును ఆయుధము యొక్క గాయములుండును రాచపుండుయొక్క మచ్చయుండును పితార్జితమగు ఆస్తియుండును

ఇతనిమన్వంతరమున ఆస్తిచెడును ముదిమిన మూలవ్యాధికలుగును.

—( బుధుడుండిన )—

అభివృద్ధియగు వంశజుడగును సద్వంశమగు గౌరవముండును జాతకునికి ఇందువల్ల లాభహీనము మధ్యప్రాయమున చాంచల్యముండును అధికముగ పనులుండుటవల్ల చింతకల్గును పిత్తజ్వరముండును

—( గురుడుండిన ]—

ఏపనిఆరంభించినను తుదిముట్టును ఆచారవంతుడును న్యాయముగ తీర్మానముచేయును మతవిషయమునకై పాటుబడును.

—( శుక్రుడుండిన ]—

అధికభాషాపరిజ్ఞానియగును మిక్కిలిపనులు తెలిసియుండును మధ్యప్రాయమగును దుష్టనడతవల్ల ధనహానియగును చర్మవ్యాధికలుగును.

—( శనియుండిన ]—

కృష్ణవర్ణముండును బేలముఖము నిందనీయమగునది అతిస్తోత్రము చేయును నీచకృత్యములు మతవిరుద్ధమగు పనులుచేయును జాతివిరుద్ధ చర్యలుండును బాల్యమునుంచే శ్రమలుండును.

—( రాహువు కేతువులుండిన )—

తర్కమునందు సంతసిలను చురుకుగ పలువిధములగు వ్యాపారములుచేయును కర్మశాలలు నిర్మించును ఫలముహీనమగును మధ్య ప్రాయమున అపకీర్తినొందును అల్పప్రాయమగును వంశవిరుద్ధమగు పనులు చేయును జనవిరోధియగును అప్రమాణములు చేయుచు జీవించును కృత్రిముడగును.

—( ౨ వ ఇల్లుయగు కన్యలో రవియుండిన ]—

జాతకునికి పిత్రార్జితము చిక్కియుండును తన మన్వంతరమున నేచెరుపును ధ్వనిచిత్రించియుండును ముదిమియందు యశము నొందును అంతమున దృష్టిహీనమగును సేద్యఆదాయము సంపాదించును.

—♦ చ న్ద్రు డు ం డి న ♦—

ఇంటివారలతో కలసియుండడు, వంశము అధికముగ నుంచినను, వాచాలుడగును పిత్రార్జిత ముండదు స్వయముగ సంపాదించిన ఆస్తి



యుండును ప్రతిపనుల యందు ఆలోచించును.

—♦ కు జు డు ం డి న ను ♦—

యశోహీనుడు చురుకుగనుండును భూస్వామి నేత్రరోగి యగును.

—♦ బు ధు డు ం డి న ♦—

మధ్యప్రాయమున కనుద్రుష్టిలోపించును పండితుడగును ధైర్యశాలి సంపన్నులగు సోదరసోదరీమణు లుందురు.

—♦ గు రు డు ం డి న ♦—

ఆస్తి యుండును రుణముండును మాటయందు నిలచును పనుల యందు చురుకుగలుగును భూస్వామియగును ధనవృద్ధియగును మధ్యప్రాయమున అదృష్టశాలియగును త్వరితముగ చెడును

—♦ శు క్రు డు ం డి న ♦—

గుణవంతుడగును సత్యవాది లాభహీనము వప్పదగిన మాటనుండదు బీదయగును.

—♦ శ ని యు ం డి న ♦—

మిక్కిలిజోంకును హీనదశ వాదన లోనష్టము వ్యాపార నష్టము. యువ్వనమున కామకుడగును ముదిమియందు ఉల్లాసహాని వంశము నందు చెరుపు పలువిధమగు మతములయందు భక్తియుండును

—♦ రా హు కే తు వు లు ం డి న ♦—

వింత కథలు చెప్పుచుండును శ్రమలుపెట్టువాడగును దార్ఢ్యము మధ్యప్రాయమున అపకీర్తినొందును లధికారులవల్ల భీతినొందును పిత్రార్జితహానియగును ముదిమియందు శ్రమలుండును.

— 3వ ఇల్లుయగుతులలో రవియుండిన —

స్వల్పముగు సోదర సోదరీ మణులుండెదరు యత్నములు ఫలించవు సార్వకాలము చింతిల్లును చెవినుండిరక్త స్రావమగును మరియు కర్ణశూలయుండును శ్రమించును.

—♦ చ న్ద్రు డు ం డి న ♦—

సవాయిపుండ్లుయుండును నీచసేవ జేయును ఇతర దేశమునందు సంతసిలును భాత్రుసహాయమగును

—♦ కుజుఁడుండిన ♦—

భ్రాతృభగిని హైన్యమగును బలసాహసి వక్షస్థలమునను నేత్రియందు నొప్పియుండును మధ్యప్రాయమునతో బుట్టువుల శత్రివల్ల చింతిలును.

—♦ బుధుఁడుండిన ♦—

దశాహీనులగు సోదరులుందురు పిత్రార్జితము చెడును విద్యస్వల్పములోపించిన ధైర్యసాహసము మధ్యప్రాయమున మిక్కిలిలోపించును

—♦ గురుఁడుండిన ♦—

ద్రిమ్మరి వ్యభిచారి తోబుట్టువుల శత్రువు తండ్రియొక్క శ్రమల వల్లచింతిలును క్వచిత్కాలము అభివృద్ధినొందును.

—♦ శుక్రుఁడుండిన ♦—

స్త్రీవిషయమ గుణముండును గానవిద్య తెల్యును న్యాయశాస్త్రమునకు తగియుండును శిక్షించుయత్నములు తెల్యును.

—♦ శనియుండిన ♦—

తోబుట్టువులు శత్రిమనొందుదురు వీరలుమించి యుందురు ఎవ్వనమున ఆరంభించిన పనిరోగి యైనందు వలనచెడును యౌవ్వనమున ఇతర మతమునందు భ్రమించును కురూపియగు స్త్రీని ప్రేమించును నీచకృత్యమునకు వప్పకుండును సంపన్నుడగునుఇతనిమన్వంతంవరకు జనులు భీతిల్లుదురు పిత్రార్జితహానియై మళ్ళిదొరుకును.

—♦ రాహుకేతువులుండిన ♦—

స్వల్పముగాతోబుట్టువులుందురు మధ్యప్రాయమున సుఖించును, పనులునెరవేరు విధములు తెల్యును యౌవ్వనమున కర్ణశూలయుండును ఇన్ద్రియ నిగ్రహుడగును యోగియైనను యాచకుడైనను అగును.

— రవ ఇల్లుయగు వృశ్చికమునందు రవియుండిన —

పిత్రార్జితముండును లాభమువుండదు మధ్యప్రాయమున సంతోషము మాతాపిత్రులు చాలాకాలముందురు పిత్రార్జితముతగ్గుచుండును

—♦ చన్ద్రుడుండుటచే ♦—

యౌవ్వనమున మాతామహ హానియగుటకు చింతిల్లును ఇతరవంశమునకు దత్తుపోవును మొదట గృహహీనను ఫిమ్మటయుండును వ్యాపా



రమున చురుకుగనుండును దూరదేశములలో వ్యాపారముచేయును.

— కుజుఁడుండుటచే —

భూసంబంధ ఉద్యోగము అస్థిరమగునట్టి దానివల్లజీవించును ప్రాయమధ్యమున మాతృహానియైననులేక రోగియైననగును పిత్రార్జితమువల్లచెందెడు లాభముగ కనకుండును యశమునొందును సోదరులవల్లయశమునొందుదు.

— బుధుఁడుండిన —

పిత్రార్జితహాని ముదిమియందు స్వల్పముగా సంపాదించును తన గౌరవముకై చింతిలునుఇతరుల ఆదాయము చిక్కును విద్యస్వల్పమగును

— గురుఁడుండిన —

రాజ్యతంత్రములు తెల్యును న్యాయశాస్త్రములెల్లను మధ్యప్రాయమున విద్యామూలమున ధనము సంపాదించును ముదిమిన వృద్ధియగును సంతసిలును నూతనమైన యిల్లును నూతనఆస్తియు చిక్కును.

— శుక్రుఁడుండిన —

స్వంతభూమినష్టమగును వ్యభిచారము వల్లనష్టమొందును ఇతరదేశవాసియగును వ్యాపారము తెల్యును పండితుడగును యౌవ్వనమున సంతసిలును ముదిమిన యశోహానియగును.

—♦ శనియుండిన ♦—

భూఆస్తిచెడును యౌవ్వనమున మాతాపిత్రాదుల హానియగును చింతిలును శ్రమలచే అభివృద్ధి నొందును ఇతరప్రయత్నములు పూర్తిగాకుండును

—♦ రాహుకేతువుండిన ♦—

ఒకదేశమునుండి రెండవదేశమునకు సంచరించునుఉల్లాసముండగు ఉద్యోగము చిక్కును మాతామహుల ఇట్లుఅతిశయిల్లిపిదప చెడును.

—శివ ఇల్లుయగుధనుస్సులో రవియుండిన —

ప్రతిష్ఠ యుండును మధ్యప్రాయమున రాజులచే గౌరవంబు గలుగును గౌరవఅభిమానకృష్ణవర్ణము రాజోద్యోగమును ప్రభుత్వములోనిచేయును ఉగ్రుడగును, పుత్రసంతతి కల్గును.

— చన్ద్రుడుండిన —

పుత్రహీనుడు పుత్రికలుందురు అవధూత లేక యాచకుడు విద్వాంసుడయ్యు కీర్తిగొండడు స్వార్జిత హానియగును స్వల్పలాభమగును మాతామహాభివృద్ధివల్ల సంతసిలును యౌవ్వనమున పితృహాని మిక్కిలి గుణవంతుడును చింతిలును జనసహాయ .. చేయును క్షేమముతోరును దూరదేశమున కరుగుచుండును.

— కుజుడుండిన —

చురుకుప్రకృతియు సంతతి కఠినులగుటకు వ్యసనము మరియు కష్టులగుటవల్ల అజ్ఞబద్ధులుకానుందురు భార్యవల్ల సంతోష మొందును.

— బుధుడుండిన —

మదిమియందు ధనమబ్బును చింతయుండును యోగియైనను యాచకుడైనయగును గుణవంతుడగు

— గురువుండిన —

సద్గుణుడును సంతాపముండున్న పన్నులుచేయు నెడనిదానము రాచకార్యమునందు చురుకును భీతిల్లడు యౌవ్వనమున అదృష్టహాని ఋణముండును గౌరవము కాపాడుకొనును.

— శుక్రుడుండిన —

సంతతి చేద్వేషించుకొనును పితృద్వేషియగును స్త్రీప్రేమవల్ల ఆస్తినిచెరుపును మధ్యప్రాయమున శ్రమనొందును.

— శనియుండిన —

సంతతి హీనమగున్న వ్యభిచరించును కీళ్ళనొప్పు లుండును ఒకరిని నమ్మకుండును నాస్తికుడగును పలువిధమగు కష్టచర్య లుండును.

— రాహుకేతువులుండిన —

అయోగ్యమగు సంతతివల్ల చింతిలును నాస్తికుడును మధ్యప్రాయమున అపఖ్యాతియు ఋణస్థుడగును మిక్కిలి మతవిరుద్ధ మగుపనులు చేయును దైవధ్యాన హీనుడగును.



( ౮ వ ఇల్లుయగు మకరమునందు రవియుండిన )

బంధుద్వేషియగును మధ్యప్రాయమున రాజదౌర్జన్యమగును చింతిలును పేగులలో కండ్లలో రుగ్మతనుండును యౌవ్వనమున వ్యవహారపు చిక్కులుండును భీతియు శతృత్వము సంతోషహీనమగును.

—( చన్ద్రుడుండిన )—

ఇతరరాజులవల్ల నష్టములుండును వెనక తిరిగిపోవును ముదిమియందు జ్వరము తీవ్రమైన నుండును ఋణమువుండును.

—( కుజుడుండిన )—

లోకులు నిందించుటచే నష్టమగును తుదకు శత్రుంజయమగును హీననడవడికొందరి శ్రీమంతులచె నష్టపడును తుదకు జయమగును.

—( బుధుడుండుటవల్ల )—

శతృవులుండరు ధనముండదు నేత్రరోగియు మధ్యనడతచే సంతసిలుదు సౌఖ్యపడును కఠినమగు మనస్సుకాదు.

—( గురుడుండిన )—

మధ్యప్రాయమునందు వ్యవహారపు చిక్కులవల్ల నష్టముండును ముదిమియందు శ్రమనొందును అపఖ్యాతియగును ఆస్తిచెడును కఠినమగు జీవనమగును.

—( శుక్రుడుండిన )—

స్త్రీలనిమిత్తము ధనమును వ్యయముచేయును ఋణముండును సవాయి పొక్కులుండును మనశ్చాంచల్యము శత్రువులవల్ల నష్టమగును చింతిలును.

—( శనియుండిన )—

విజయుడు మధ్యప్రాయమున శత్రువులుందురు భీతియు దౌర్జన్యము పొందును స్త్రీవిషయమగు చింతకలుగును ఉల్లాసముండదు.

—( రాహుకేతువులుండిన )—

శతృవులను జయించును గౌరవమునకై పాటిల్లను రాబడియుందురు [illegible] శ్రమజెందును తోబుట్టులు శత్రుపొందెదరు కల్ల రుగ్మతతో [illegible]

—[ ౭ వ ఇల్లుయగు కుంభములో రవియుండిన ]—

సార్వకాలము వాదనలుండును అధికారులవల్ల నష్టమగును స్త్రీవల్ల ఉల్లాసముండదు.

—( చన్ద్రుడుండిన )—

వివాహములగును భార్యరోగియగును సముద్రయానముచేయును

—[ కుజుడుండిన ]—

అధికమగు వ్యభిచరించును అభివృద్ధినొందును సంతోషము కలుగును ప్రాయమధ్యమున వాదనలుండును హటుడగును.

—( బుధుడుండిన )—

స్త్రీలుందురు వీరలవల్ల ఉల్లాసముండదు మధ్యప్రాయమున కీర్తిహీనమగు పనిచేయును.

—[ గురువుండిన )—

భార్యయుండుటవల్ల స్వప్రయత్నమువల్ల ధనముచేకూరును సత్ప్రవర్తనియగు భార్యయుండును యౌవ్వనమున శ్రమలొందును ఋణముండును

—( శుక్రుడుండిన )—

వ్యభిచారియగును దుష్టుడగును ఉపాధ్యాయులకు వృద్ధులకు శత్రువగును స్త్రీమూలమున పెంపొందును జటిలమగు సంభాషణ యుండును యౌవ్వనమునుంచి యశస్సుగాంచును.

—( శనియుండిన )—

వాదనయందు నేర్పరియగును నిదానించి పనులుచేయును నిందుగయోచనచేయును లజ్జాహీనము గౌరవహీనుడగును ఒకమాటపై నిలచియుండడు ఇతర దేశవాసియగుటవల్ల ధనముచిక్కును.

—( రాహుకేతువులుండుటవల్ల )—

ఆదాయము ప్రతిష్ఠహానియగును శత్రువుల వాదనలలో నష్టమొందును దిమ్మరియగు చెడు పేరునొందును.

( ౮ వ ఇల్లుయగు మీనము వరవి యుండిన )

పిత్రార్జితముండదు పేగుల గురించిన మరియు రక్తసంబంధమగు రుగ్మతచే బాధనొందును అయ్యోపసులు రాకుండును పితృప్రరోగ గ్రస్తు



డగును అనాయాస మరణమొందును.

—( చన్ద్రుడుండిన ]—

యౌవ్వనారంభమున మాతృహానియగును పెద్దలు మరణింతురు ఋణముండును మతవిరోధియగును మధ్యప్రాయమున శ్రమలుండును అల్పాయువగును.

—( కుజుడుండిన )—

అల్పాయువగును ఆయాసమరణమగును అగ్నిభీతి ఋణము అపకీర్తినొందును.

( బుధుడుండిన ]

అల్పాయువు పైనుండిపడి మరణించును రుణముండును అర్ధప్రాయమున అపఖ్యాతియగును.

—( గురువు వుండిన )—

ఋణముండును గొప్పవంశమున జనియించియు అధివిద్య నేర్చియున్నను దరిద్రుడగును దుర్వ్యయము చేయకుండును పురాణీకుడగును.

—( శుక్రుడుండిన )—

స్త్రీలుందురు వీరలవల్ల కష్టసుఖమునొందును అర్ధప్రాయమున శ్రమపడును శిరోవ్యాధినుండును.

— శని, రాహువు, కేతువువుండిన )—

పిత్తవ్యాధి మధ్యప్రాయమున రాజభీతియగును అంతమున సంతసిలును ధనహానియగును చోరులవల్ల నష్టమగును శత్రుభాధ కలుగును. అగ్నిభీతియగును యౌవ్వనమున దౌర్జన్యమొందును ఋణముండును, మత్తువస్తువభ్యాసియగును స్వల్పజీవనాధారముండును.

—(౯ వ ఇల్లుయగు మేషమునందు రవియుండిన)—

యౌవ్వనారంభున పితృహానియు మాతాపిత్రాదులు సంతసిల్లరు, జాత యోగియైనను యతియైననగును గుణవంతుడును అధికప్రాయము, కీర్తినొందును బంధువులవల్ల నష్టమగును జీవితకాలము సామాన్యముగనుండును.

—[ చంద్రుడుండిన )—

మిక్కిలి వివాదనలుండును మాతామహనష్టమగును చింతిలును, మధ్యప్రాయమగును పితృహాని పితార్జితముండియు ఫలలోపమగును.

—( కుజుడుండిన )—

సుఖియగును ముదిమియందు లాభమగును ప్రాయమధ్యన పితృహాని వంశశతృవగును. —(బుధుడుండిన)—

అన్నిపనులు తెలిసియుండును పండితుడగును సకలజన క్షేమము కోరును కొంతకాలము పురాణీకుడగును ఉత్తమజీవనమగును దాతయగును మధ్యప్రాయమున కళత్ర హానియగును.

—( గురువుండిన )—

మధ్యప్రాయమున మిక్కిలిసంతసిలును శీతబాధనొందును చాల్ప ఆయువుండును ధనముండును దాతయగును అధికముగ తండ్రిజీవించును, ముదిమియందునష్టకష్టములుండును.

—[ శుక్రుడుండిన ]—

యౌవ్వనారంభమున మాతాపిత్రాదుల హానియగును విద్యాసంపన్నమధికమైనను చింతిలును వాహనములు మెండుగనుండును చరాస్తియుండును. —(శనియుండిన —

ఎవ్వనమున అధిక శ్రమలుండును ముదిమియందు శ్రమించును, సంతోషహీనమగును.

—[ రాహువు కేతువులుండిన ]—

మధ్యప్రాయమున మాతాపితృహానియగును చింతలుండును పెరువుయోచనలు గౌరవరక్షణ పాటొందును ఋణముండును మిక్కిలి కీర్తినొందును. (౧౦వ ఇల్లుయగు వృషభములో రవియుండిన)

రాజ్యతంత్రములు తెల్యుటచే జీవించును వాదనసమాప్తమగు పిదప అధిక జయశాలయగును సుకీర్తియు గౌరవిరచుటకు తగియుండును, సత్కార్యములు చేయును.

—( చంద్రుడుండిన )—

ముదిమియందు గొప్ప అధికారి ఇతరదేశమున యగును సుకీర్తియుతుడు కీర్తిలోపించును సముద్రయానముచేయును.

—( కుజుడుండిన )—

దార్జన్యజీవనము అధికారియగును గౌరవంతుడును సంపన్నుడగును, శతృంజయుడగును అర్ధప్రాయమున మరణదండనయొసంగునట్టిది తీర్మానించునట్టి అధికారము కలుగును.



—( బుధుడుండిన )—

విద్యయే ఆధారమగు జీవనమగును గణితశాస్త్రముభిషగ్విచారము తెల్యును దాతయగును (గురుడుండిన)

తీర్మాణచేయునట్టి అధికారియైనను వివాదసంబంధ జీవనముచేయును ప్రసిద్దినొందిన తీర్పరి సుకర్ముడగును నిర్భయుడగును ధైర్యశాలి ధనవంతుడగును సంతానముండును

—[ శుక్రుడుండిన ]—

వాహానములుండును భూఆస్తియుండును తిర్గిచెడును ధనమబ్బును, అధికారముండును కవిత్వమువల్ల జీవనాధారముగల్గును చాల్పగా వ్యాపారముచేయును. (శనియుండిన)

పరిచారకుడగును అప్రమాణి కృత్రిముడు మధ్యప్రాయమున ధనముండును భూఆస్తిచిక్కును. (రాహుకేతువులుండిన)

చేతిపనులుచేయుచు జీవించును గౌరముచేయదగినవాడు వాదనలుండును రుణమువుండును చింతిలును నష్టపడును శ్రమలుండును మల్లి శ్రమలనుండి తప్పిపోవును ఇతరదేశవాసియగును.

—[ ౧౧ ఇల్లుయగు మిధునములో రవియుండిన ]—

జ్యేష్ఠుడగు సోదరుడుండును రాజోద్యోగియు ప్రాయమధ్యమున ఉద్యోగహాని మల్లి ఉద్యోగము దొరుకును

( చంద్రుడుండిన )

అధికముగా పనులుతెల్యును స్వచ్ఛమైన పలుకుబడి జయశాలియగును. —( కుజుడుండిన )—

జ్యేష్టసోదర హానియగును అథవాయుండనేని అతనికిద్వికళత్రమగును మధ్యప్రాయమునుండి అభివృద్ధినొందును రాజోద్యోగమునొల్లదుతోబుట్టువులకు సంతతియుండదు అధన వుండిన బాల్యమునందే చనిపోవుదరు. —(బుధుడుండిన)—

స్థిరచరాస్థులుండును అదాయమునకన్న వ్రయముమించియుండును.

—[ గురుడుండిన ]—

ఋణస్థుడగును మధ్యప్రాయమున ఉద్ధారముచేయును భూఆస్తి యుండును కీర్తియుతుడును రాజోద్యోగియగును.

—( శుక్రుడుండిన )—

విపత్తులొందునుమధ్యప్రాయమునశ్రేయస్సునుండునుస్త్రీయుండుటచే అదృష్టముకలుగును.

—( శనియుండిన )—

తోబుట్టువు జ్యేష్ఠుడువుండడు సేద్యమువల్లకీర్తియుండును కల్పితవాదనలవల్ల జీవించును.

—[ రాహుకేతువులుండిన ]—

ఇతరదేశమునందు పనులుచేయును కీర్తినొందును ధైర్యసాహసుడగును పోగుచేయబడు ధనమును ముదిమియందు వ్రయపర్చును పనివాడగును శత్రువులుందురు.

—( ౧౨వ ఇల్లుయగు కర్కాటకములో రవియుండిన )—

పరదేశమున గొప్పయధికారియగును గౌరవమునకై పాటుబడును, స్వనష్టమునకుఒప్పుచు ఇతరులకు మేలుచేయునుసత్కీర్తినొందును.

—[ చంద్రుడుండిన ]—

స్వాస్థి సామాన్యచర్య కీర్తివంతుడు ప్రథమమందు ఆపద అంతమున సంతోషము గౌరవయుతుడు ఇతరదేశసంచారియగును.

—( కుజుడుండిన )—

జన్మభూమ్యభిమాని మధ్యప్రాయమున పనులనువదలును ఇతర పనుల అంగీకరించును అపూర్వ ఆస్తినిచెరుపును.

—[ బుధుడుండిన ]—

ఎంతవిద్యనేర్చినను లాభములేదు దరిద్రుడును ఆపదలుండును.

—( గురుడుండిన )—

సుకీర్తి అర్ధప్రాయమున రాజఉద్యోగి రాబడినిహేతుకమగు వ్రయమగును.

—[ శుక్రుడుండిన ]—

అధికసంతోషము వాహనములుండును అంతమున భూఆస్తి చిక్కును సత్కీర్తియు వ్రయముచేయును.



—( శనియుండిన )—

మధ్యప్రాయమున ఆపదలొందును ఋణముండును నష్టపడును వంశహాని హేతువగును

—( రాహుకేతువులుండుటవల్ల )—

ఇతర దేశమున సంచరించుటయగును లాభించదు అంత్యమున ఉద్యోగమువల్ల సంతసిలును వివాదకారణానుసారమగు ఆపదలువాటిల్లును నష్టపడును యవ్వనమున చులుకగా జూతురు.

—(౬) ( కన్యాలగ్నకుండలి )—

కొద్దిదినములు వ్యసనమగును దారిద్ర్యము సంతసిల్లుట స్వల్పకాలము బాహ్యమతము, పనులయెడనేర్పరి రోగియు అంత్యమునవర్ధిల్లును ప్రథమమందుధనముండునునష్టమగును శ్రమముండును ౫, ౧౦ ౧౮ సం॥లలో రోగియగును వాదనలుండును కాముకుడగును కోరుచుండును.

— ౧వ ఇల్లుయగు కన్యలోరవి యుండిన —

పిత్రార్జితహాని రోగి నిడవిగల శరీరము బాల్యమున పిత్రుహానియగును.

— చన్ద్రుడుండిన —

స్వల్పప్రాయము శీతబాధనొందును.

— కుజుడుండిన —

స్వల్పప్రాయము, శత్రువృద్ధి పిన్నతనమున శ్రమలుండును.

— బుధుడుండిన —

బలహీనుడు మధ్యప్రాయమగును.

— గురుడుండిన —

బలహీనుడు రోగి మధ్యప్రాయము సుకీర్తియగును.

— శుక్రుడుండిన —

ఆరంభప్రాయమున స్థిరచరాస్తి నష్టమగును పిదపసంపాదించును అధికప్రాయమగును స్త్రీలుండుదురు గౌరవాభిలాషియగును.

— శనియుండిన —

అధికప్రాయము అదృష్టశాలి యశస్కాముడు మధ్యప్రాయమున వ్యవహారచింత కలుగును,

— రాహుకేతువులుండిన —

స్వల్పప్రాయము పిత్రార్జితహాని రోగి ఏదోఒక అజ్ఞహీనము వంశశత్రువు ఋణస్థుడగును.

— ౨వ ఇల్లుయగుతులలో రవియుండిన —

ఋణస్థుడు నిశ్చేతుకప్రయము వంశమున ఆపదలు ప్రాయఆరంభమున తల్లిదండ్రులు శ్రమనొందుదురు

— చన్ద్రుడుండుటచే —

అర్ధప్రాయము పైనధనముండును వంశమునందు జనవృద్ధి నేత్రరోగియగును

— కుజుడుండిన —

వంశమును గురించిన ఆపదలు న్యాయశాస్త్ర యుతుడును పిత్రార్జితము హానియగును.

— బుధుడుండిన —

అదృష్ట విద్యవల్ల యశము మృదువాక్కు పుణ్యాయుతుడు,

— గురుడుండిన —

ఋణస్థుడు పనులలోనేర్పరి అయినను యశోహీనుడు వంశవృద్ధి స్త్రీలుందురు.

— శుక్రుడుండిన —

ధనవంతుడు అదృష్టశాలి మృదువాక్కు గౌరవమును కాచుకొనును పెద్దలవల్ల పెంపొందును తండ్రికి ఇద్దరుభార్య లుందురు గుణవంతుడు వ్యాపారమునందు లాభమగును.

— శనియుండిన —

వంశముతగ్గుచుండును బేలగామాట్లాడును అంత్యమునవర్ధిల్లును

— రాహుకేతువులుండిన —

యౌవ్వనా రంభమున వాదనలుండును జగడమునాడువాడు యౌవ్వనమున మాతాపితృహాని ద్రవ్యహాని ఇతర దేశవాసి యగును విజయుడగును.

— ౩వ ఇల్లుయగు వృశ్చికములో రవియుండిన —

తోబుట్టువులవల్లశ్రమ ఇతర దేశమునందు యశస్సు ఇటువంటి తోబుట్టువులు పొల్గొందురు.



—( చంద్రుడుండిన )—

సోదరిమూలమున యశమొందును మిక్కిలిసుఖము తోబుట్టువుహానియగును యవ్వనఆరంభమున శ్రమఇత్యాదికములగును.

—[ కుజుడుండిన )—

పిత్రార్జితహాని కాముకుడు గుండెవక్షస్థలమున శూలించును.

—( బుధుడుండిన )—

యౌవ్వనారంభమున తోబుట్టువునకు హానియగును వాదనలో చిక్కును న్యాయశాస్త్రీయు అర్ధప్రాయమున నష్టమగును

—[ గురుడుండిన )—

తోబుట్టువులను ప్రేమించును మతాను రాగిపండితుడు పనివాడు స్త్రీవల్లయశస్సు

—[ శుక్రుడుండిన )—

ద్వికళత్రము అర్ధప్రాయమున పెంపొందును.

—( శనియుండిన )—

సామాన్యముగ తోబుట్టువులుందురు తోబుట్టువుసంతతివల్ల శ్రమ ఇతరధనమపహరించును న్యాయశీలుడు.

—( రాహుకేతువులుండిన )—

ఋణముండును కృత్రిమమువల్ల ఆస్తిహాని శ్రమలుండును మధ్యప్రాయమున అధికారులభీతికలుగును.

( ౪ వ ఇల్లుయగు ధనస్సులో రవియుండిన )

రాజభావ నెరిగియుండును పిత్రార్జితమగు ఆస్తిచే కీర్తిల్లును గౌరవము భగవద్భీతియు పండితుడును అధికప్రాయమగును.

—( చంద్రుడుండిన )—

బాల్యమునందు మాతృహాని ప్రతి[illegible] మోస వ్యవహారము ప్రాయమధ్యమున శ్రమ[illegible] ఒకవ్యాపారమువల్లజీవనమగును.

—( కుజుడు[illegible]

ఇతర దేశమునందు కీర్తినొందును మాతామహుల మూలమున బాణవిద్య నేర్చును మధ్యప్రాయమున మాతృ[illegible]హానియగును.



—( బుధుడుండిన )—

మాతృమూలమున ధనమబ్బును లోభి అధికప్రాయము భూస్వామి మధ్యప్రాయమున నిలుచునట్టిరాబడి గుణవంతుడగును.

—( గురుఁడుండిన )—

ఎంతటిపండితుడైనను ఖ్యాతిపొందడు అంత్యప్రాయమున సంతసిలును అధికప్రాయము

—( శుక్రుడుండిన )—

మందిరములుండును పలువిధవాహనములుండును మధ్యప్రాయమున ధనముండును ఇందులో మాతృహానియగును.

—( శనియుండిన )—

మొదట పిత్రార్జితహాని మళ్లిదొరుకును గౌరవయుతుడు చింతిలును యౌవ్వనమున వాదనలుండును బాల్యమున మాతామహుల యింటిలో నష్టమగును.

( రాహుకేతువులుండిన ]

మొదట దేశద్రిమ్మరియగును కష్టసుఖములు సమానమగును నిలిచెడు రాబడియుండదు బాల్యమున మాతామహుల ఇంటిలోనష్టమగును.

( ౧౦ వ ఇల్లుయగు మకరమున రవియుండిన )

శరీరతాపమువల్ల శ్రమ మిక్కిలి గుణవంతుడును ముదిమియందు సంతతి జోతిషవిద్య తెల్యును చింతిలుచుండును వ్యత్యాస సమయమున సంతోషసుఖము ఇత్యాదిక ఫలములగును

—( చన్ద్రుండిన )—

ఒకకుమారియుండును ఇతర దేశమునందు రాబడి దొరుకును లేక ఇతరుల ఆదాయమువల్ల సుఖపడును జ్యేష్టసోదరులుండురు శీతరుగ్మతవల్ల శ్రమనొందును.

—( కుజుడుండిన ]—

అర్ధప్రాయమున సంతానహాని యౌవ్వనారంభమున శ్రమ ముదిమియందు ఉల్లాసము భూఆస్తి కల్గును జూదరియగును శతృవృద్ధియుండును.

—( బుధుడుండిన ]—

అంత్యకాలమునసంతసిలును సద్గుణుడగును నమ్మదగినవాడగును.



—( గురుఁడుండిన ]—

పిత్రార్జితనష్టమగును మధ్యప్రాయమున నీచముగా వంచింప బడును సంతతికి బాల్యముననే హానియగును ఋణస్థుడగును.

—( శుక్రుండిన )—

ధనముండును కూతురులుండురు రాజభాష తెల్యును ఒక పక్షము వైపునుండి రాజసభలో వాధించువాడగును శ్రీమంతులసమానమగు ధనముండును ఈయశస్సు మధ్యప్రాయమున స్త్రీమూలమునకలుగును.

—( శనియుండిన ]—

సంతానహాని బాల్యమునుంచియె శ్రమించును పిత్రార్జిత హాని ఇతర దేశసంచారియగును.

( రాహుకేతువుండుటచే ]

సంతతిహాని ముదిమియందు సంతానముండును రాజక్రోధము కలుగును ఋణస్థుడగును దశాహీనత పలువిధబాధలొందును ప్రతిదానిని తెలిసియుండును.

[ ౧౧ వ ఇల్లుయగు కుంభమున రవియుండిన ]

బంధుమూలమున వ్యయమగును చింత కఠినరోగి మధ్య ప్రాయమున అవమానపడును.

—( చన్ద్రుడుండిన )—

పెద్దతోబుట్టువు సంతతిలోనష్టము స్త్రీనిమిత్తము చింతిలును జ్వరము క్షయ కలుగును శ్రమపడును మధ్యప్రాయమున తిరుగు చుండును.

—[ కుజుడుండిన ]—

రాజదండనలేక అధికారులవలన దండింపబడును ఇట్టిశిక్ష మధ్యప్రాయమున కలుగును ఉద్యోగ హానియగును తోబుట్టువు హానియగును పిత్రార్జితహాని ఋణస్థుడగును.

—( బుధుడుండిన )—

మాతామహులలో నష్టమగును స్వనష్టముచేసుకునును ఆసమయమున సంతసిలును దుర్బలుడగు మధ్యప్రాయమగును.

—[ గురుఉండిన )—

ముదిమియందు సంతసిలును గౌరవమొందును మధ్యప్రాయమున ప్రతిష్ఠనొందును ధనవ్యయమగును ఋణముండును శ్రమనొందును.

— శుక్రుడుండిన —

యౌవ్వనమున భార్యతో అనుకూలముండదు కాముకుడగును ఎచ్చటమిత్రత్వమును కునునో అచ్చటశత్రుత్వ మగును స్త్రీనిగురించి శ్రమ జుందును.

— శనియుండిన —

శత్రువృద్ధి అతిరోగియు రాజనిగ్రహమున శ్రమ తుదకు శ్రమతీరును మధ్యప్రాయమున వంచన శ్రమగలుగును.

— రాహుకేతులుండుటచే —

రాజనిగ్రహమువల్ల శ్రమ పిదపతీరుగును రోగి ఋణము శత్రువులుందురు.

— ౭వ ఇల్లుయగుమీనమున రవియుండిన —

రోగియై ఉల్లాసహీనమగు పత్నియగును రాజ్యద్వేషము ఋణము కళత్రహాని మధ్యప్రాయమున తండ్రివల్ల లాభముండదు.

— చన్ద్రుడుండిన —

ప్రథమమందు సుగుణియగు సతిదొరుకును భార్యనుగురించి శ్రమపడును పెద్దవాడగు తోబుట్టువు కీర్తినొందియు ధనవంతుడగును.

— కుజుడుండిన —

వాదించెడు భార్యయుండును సంతసహాని ఇతరుల సొత్తుకు అధికారియగును.

— బుధుడుండిన —

ఎవ్వనమున శ్రమజెన్దును విద్యమూలమున ధనము మధ్యప్రాయము స్త్రీలుందురు, వ్యాపారము చేయును తీర్పరియైనను యగును.

— గురుడుండిన —

సద్గుణియై స్త్రీయుతమగు భార్యకలుగును శ్వశుర మూలముగ కీర్తిల్లును గౌరవముండును మధ్యప్రాయము పైనయశోవంతుడగును.

— శుక్రుడుండిన —

స్వరూపియగు భార్యయగును అయినను వికటియగును కాముకుడ



గును భార్యయొక్కతల్లి నసించును తీర్పరియైనను అధికారియైననగును సముద్రయానము చేయును.

— శనియుండిన —

రిక్తుడగును సామాన్యరూపవతియగుచు ప్రేమించునట్టి భార్యకలుగును భార్యశరీరమున లోపించియుండును నలుపువర్ణమగును పాపకృత్యములు చేయును.

— రాహువు కేవులుండుటచే —

బలహీనత భార్యచే సంతోషముండదు సద్గుణుడు గౌరమునొందును నాస్తికుడు సర్వమును సమముగా నెంచును చాల్వగా దేశములలోనుసంచరించునుయౌవ్వనమునశ్రమలుండును ముదిమియందు సంతసిలును

— ౮వ ఇల్లుయగు మేషమున రవియుండిన —

సుశయ్యనుండును స్వచ్ఛమైన ఆహారము దొరుకును అకాలమున సుఖసౌఖ్యమగును మొదటపనులునొక్కకుండునుఅంతమున చేకూరునురాజ్యతంత్రములలో చిక్కులుండును తదుపరి విడిపోవును.

— చన్ద్రుడుండిన —

యౌవ్వనారంభమున మాతాపితాదులు నశింతురు తోబుట్టువులుందురు ముదిమియందు సౌఖ్యము శీతబాధనొందును సామాన్యప్రాయమున జ్వరములేక తుయయుండును.

—[ కుజుడుండిన ]—

మధ్యప్రాయమున శత్రువులుందురు పిత్రార్జితహాని ఋణముండును ఇత్యాదికములగును.

—( బుధుడుండిన )—

స్వల్పాయువు దుర్బలశరీరి అధికరోగి వంశజులనష్టము ఇత్యాదికములగును.

—( గురుడుండిన )—

ఋణస్థుడగును మొదటబాహ్యసంతసము అయినను ఆపదలు శ్రమలు వాటిల్లును ముదిమియందు స్వల్పసుఖము పుత్రహానియగును.

—( శుక్రుడుండిన ]—

యౌవ్వనమున సంతోషి. ముదిమిన శ్రమ పిత్రార్జితహానిఇత్యా

దికములగును. —( శనియుండిన )—

దారిద్ర్యము యౌవ్వనమున శ్రమ మధ్యప్రాయం వరకు ఆపద ఇత్యాదికములగును.

(రాహువు కేతువులుండుటచే)

ముదిమియందు ధనికుడగును వ్యాజ్యమునందు జయమగును అధికమగుమిత్రువులు మధ్యప్రాయమువరకు ఆపదలుండును యౌవ్వనారంభమునవిషజన్తుభీతియగును ఋణముండినను కీర్తినొందును

— ౯వ ఇల్లుయగు వృషభమున రవియుండిన —

వంశప్రసిద్ధికీర్తి పేరొందినవాడును పిత్రార్జిత యుతుడును పిత్రుమూలముగ ఖ్యాతినొందును వర్ధిల్లును మొదట సంతసముండదు మధ్యప్రాయమున సుప్రసిద్ధియగును ఇత్యాది ఫలమగును.

— చన్ద్రుడుండిన —

తోబుట్టువు లుందురు వర్ధిల్లును గౌరవమొందును ఘనత నొందును ముదిమియందుశ్రమపడును

— కుజుడుండిన —

మధ్యప్రాయమున సుకీర్తియు పితృహాని పిత్రుమూలమగు నష్టము ఇత్యాది ఫలమగును.

—( బుధుడుండిన )—

పిత్రుమూల మగునష్టము స్వల్పసుఖము విద్యవల్ల అధికలాభముండదు ఇత్యాదిఫలమగును.

— గురుడుండిన —

అధికప్రాయము మాతాపితృలు సుఖంతురు గౌరవమునొందును ప్రసిద్ధుడగును సుకీర్తియు ముదిమియందు మిక్కిలి ప్రసిద్ధిగాంచును.

— శుక్రుడుండిన —

అద్రుష్టశాలి కీర్తినొందును ఇత్యాది ఫలములు గలుగును,

— శనియుండిన —

మొదలుశ్రమనొందును నష్టమగును ఇల్లుచెడును ముదిమియందు యశమొందును అధికారియగును.



—( రాహుకేతువులుండిన —

గర్వియగును ధనవంతుడగును సుగుణుడు ప్రాయ ఆరంభమున మాతాపిత్రుహానియగును ముదిమియందు శ్రమనొందును నలుపువర్ణమగును. ( ౧౦వ ఇల్లుయగు మిధునములో రవియుండిన )

రాజ్యమునందు చేతిపనులలో మించియుండును ముదిమియందు వేరొందును బలశాలి ధనవంతుడగును ఇత్యాది ఫలములగును.

— చన్ద్రుడుండిన —

పనివాండ్రు లోబడియుందురు జీవితకాలమున కీర్తిల్లు పనులుచేయును దాతయగును సేద్యముచె ఆదాయము నుండును ఇత్యాదిఫలములగును. — కుజుడుండిన —

జీవాన్తమువరకునిలచెడు ఆస్తియుండదు స్వేచ్ఛముగాజీవితకాలముగడుపును ఇత్యాదికమగును

—( బుధుడుండిన )—

పలువిధములగు వ్యాపారములు చేయును యౌవ్వనారంభమున నిలచెడుతాబడి యుండదు ముదిమియందు నిలిచెడురాబడికలుగును ఇత్యాది ఫలమగును. — గురుడుండిన —

ఉపాధ్యాయుడగును గుణవంతుడును కీర్తియుతుడగును ఇత్యాది ఫలమగును. — శుక్రుడుండిన —

తర్కశాస్త్రముునేర్పును వాచాలుడు శాస్త్రమునేర్చును బ్రహ్మవిద్యనేర్పును గౌరవయుతుడగును మధ్యప్రాయమున ప్రసిద్ధినొందును తీర్మాణసభలో పనిచేయును.

— శనియుండిన —

అధికారము చిన్నదైనను జనులు ఒగ్గియుందురు కుత్రిమములచే జీవితము నీచకృత్యుడగును మతవిరుద్ధుడగును ఇత్యాది ఫలమగును.

— రాహుకేతువులుండిన —

పనులుచేయును చిత్తరువువ్రాయును యంత్రములు చేయువాడును ప్రసిద్ధుడు కృష్ణవర్ణము గుణవంతుడగు దాతయగును ఇత్యాదికములగును. ౧౧వ ఇల్లుయగు కర్కాటకములో రవియుండిన,

నిష్ఠేతుకత్రయము తోబుట్టువు ప్రసిద్ధికెక్కును స్వయము ప్రసిద్ధియగును ఇత్యాదికములగును.

— చన్ద్రుడుండిన —

చాల్పుగా సంపదయగును గౌరవయుతుడును దాతయు ఇత్యాదికములగును.

— కుజుడుండిన —

పిత్రార్జితహాని ఋణస్థుడగును ఇత్యాది ఫలమబ్బును.

— బుధుడుండుటచే —

పలువిధభాషలునేర్చును ముదిమియందుసౌఖ్యము ఇత్యాదిఫలము

— గురుడుండిన —

ప్రసిద్ధిగాంచును సుకీర్తియు సంపన్నుడు యజమాని తోబుట్టువుల మూలమున శ్రీమంతుడగును.

— శుక్రుడుండిన —

స్త్రీలుందురు పలువిధ వాహనములుండును స్థిరముండవు ఇత్యాదికమగును.

— శనియుండిన —

వాదించునట్టి సతిఋణస్థుడు మధ్యప్రాయమున వంచలయగును ఇత్యాది ఫలమగును.

— రాహువుకేతువులుండిన —

జ్యేష్టుడు మరణమొందును లేక నష్టమొందును ధనవృద్ధియగును కీర్తిల్లును గౌరవ వంతుడగును వీరుడగును ముదిమి యందు సంతసిలును దాతయగును వాక్సుద్ధియగును.

— ౧౨వ ఇల్లుయగు సింహములో రవియుండిన —

రాజ్యమునందు అధికారియగును మధ్యప్రాయమునుండి కీర్తిల్లును. గౌరవశాలి న్యాయమగు ధనముండును యౌవ్వనప్రారంభమున మాతాపితాదుల హానియగును.

— చన్ద్రుడుండిన —

సముద్రయానముచేయును యౌవ్వనారంభమున సంతోషముండదు ముదిమియందు సంతసిలును అకాలమగు క్షుత్తు ఇత్యాదియగును.



— కుజుడుండిన —

సుఖదుఃఖములు సమానము లుండును సేద్య ఆదాయము చెడును ఇత్యాదియగును.

— బుధుడుండిన —

విద్యవల్లచాల్పు ఫలముండదు చింతిలును మాతాపితృహాని మధ్యనధనముండును.

— గురుడుండిన —

తీర్పరియగును ఇతరదేశమున తీర్మానసభలో పనిజేయుట వల్ల కీర్తిల్లును అధికసంతోషి న్యాయవర్తనుడగును యశోవంతుడగును.

— శుక్రుడుండిన —

వాహనములుండును అయినను స్థిరముగనుండవు ఇండ్లుయుండును ధనవంతుడగును ఋణముండును దాతయగును.

— శనియుండిన —

యెవ్వనారంభమున సంతసిలడు ముదిమియందు సంతసిలడు మధ్యప్రాయమున కీర్తిలును ఇతరదేశ సంచారియగును ధనముండదు ఋణముండును.

— రాహుకేతువులుండిన —

సంచారియగును స్థిరమగు అధికార ముండదు ఋణమగును ఆపదలొందును ముదిమియందు న్యాయమగు సంతోషమొందును.

— ౭ తులాలగ్నమును గురించియు —

సతులుందురు సంతతి యుండును గౌరవింపదగిన వంశమగును ధనముండును గుణవంతుడగును యోగియగును బ్రహ్మవిద్య తెలిసి యుండును శ్రీయుతులగు స్నేహితులుందురు ౭ లేక ౧౨ ౧౯ ౨౫ ౪౨ సం॥ల లో రుగ్మతగాంచును.

— ౧వ ఇల్లుయగు తులలో రవియుండిన —

వేడిమిచేబాధనొందును ముదిమియందు కీర్తిచెడును మధ్యప్రాయమగు ఇత్యాదికములు.

— చన్ద్రుడుండిన —

కీళ్లలోనొప్పులుండును ధనముండును సంతతియగును ముదిమియం

దు నేత్రరుగ్మతయగును స్వల్పప్రాయమగును ఇత్యాది.

— కుజుడుండిన —

శత్రువులవల్ల శ్రమనొందును రుణముండును మేధస్సుచాలును స్వల్పప్రాయము ఇత్యాది.

— బుధుడుండిన —

మధ్యప్రాయము సామాన్యవిడివి స్వల్పప్రాప్తిముదిమియందు అదృష్టుడగును ధనమబ్బును.

— గురుడుండిన —

మతశాస్త్రముగ వర్తిల్లును నిష్కళంకుడు అధికప్రాయము ధర్మశాస్త్రము తెలిసియుండును. ధనవంతుడగును ముదిమియందు భూస్వామియగును.

— శుక్రుడుండిన —

స్త్రీమూలము రంజిల్లును ప్రియాధిక్య మగును కండ్లలోభిన్నించియో లేక ఒక అంగవైకల్యమగును అదృష్టశాలి మప్రసిద్ధుడు బాల్యమునందే పేరొందును సంతాన సుఖము

— శనియుండిన —

మధ్యప్రాయమగును పిత్తజ్వరబాధ వంచింపబడును విషజన్యబాధ కలుగును కాముకుడు చింతిలును ముదిమియందు హాయిగా నుండును,

— రాహువులుండిన —

దయరహితుడు నిర్ధనుడు దుఃఖియు భిక్షుకుడు విదేశవాసి వ్యయమగును నేత్రరోగి నీచవృత్తి పాపియగును.

— కేతువ్వ్యయమందు —

కర్ణరోగి పరులవిఘ్నకారుడు నిందితుడు గుణహీనుడు ధర్మకార్యములుచేయును స్వర్గస్థుడగును.

— ౯వ ఇల్లుయగు వృశ్చికమున రవియుండిన —

ఎవ్వారంభమున ధనహాని తోబుట్టువుహాని న్యాయమగు ధనముండును.

— చన్ద్రుడుండిన —

అధికముగ భాషలుతెల్యును ధనముండును గౌరవశాలియగును సామాన్యముగ సంతానముండును.



— కుజుడుండిన —

యుద్ధము చేయువాడును పిత్రార్జితహాని బాల్యమున నిర్ధనము ముదిమియందు ధనము తోబుట్టువుల శత్రువు చింతిలును.

— బుధుడుండిన —

ఋణముండును శత్రువృద్ధి మిక్కిలిగాభాషలు తెల్యును అల్పప్రాయము జ్యేష్టుడు చింతిల్లును.

— గురుడుండిన —

ఇతర దేశభాష తెల్యును యావ్వారంభమున మాతాపితృహాని ముదిమియందు కీర్తిల్లును ధనముండును సంతసిల్లును

— శుక్రుడుండిన —

కాముకుడు మృదువాక్కు గౌరవవంతుడు న్యాయప్రకృతియగును

— శనియుండిన —

విద్యాహీనుడు యౌవ్వనమున దరిద్రుడు అన్యాయార్జిత జీవితుడు సంతతియుండును మోసకుడు ప్రాయమధ్యమునవంచన ఉద్యోగముండును అప్రతిష్టనొందును.

— రాహువు కేతువులుండిన —

న్యాయవర్తనమువల్ల ధనమును సంపాదించును చెడ్డమనుష్యు ముదిమిలో ధనముండును వాదకుడు దుర్జనుడు గౌరవశాలి యుద్ధముచేయువాడు నేత్రరోగియగును.

౧౦వ ఇల్లుయగు ధనుస్సులో రవియుండిన.

తోబుట్టువులుండురు స యుచ్చ లుండును ధైర్యశాలి బలయుతుడు సుకీర్తియు రాజ ష తెల్యును.

— చన్ద్రుడుండిన —

తోబుట్టువు లుందురు గాయకుడగును ధనవంతుడగును మాతామహులు అధికలాభము చేయుదురు.

— కుజుడుండిన —

తోబుట్టుహాని గౌరవ మొందును కోపియగును ఋణస్థుడగును శత్రువృద్ధి న్యాయమగు ధనముండును.

— బుధుండిన —

తోబుట్టువులుందురు విద్వాంసుడగును మృదుభాషి గుణవంతుడగును

— గురువుండిన —

భాషాపరిజ్ఞాని యగును తోబుట్టువు లుందురు విద్యవల్ల మిక్కిలిఫలముండదు.

— శుక్రుడుండిన —

మధ్యప్రాయమున తోబుట్టుహాని స్త్రీమూలమున ధనమబ్బును గౌరవమొందును సుభాషి మృదువగు ధ్వని.

— శనియుండిన —

తోబుట్టువులచే శ్రమయగును చింతిలును యౌవ్వనమున ధనహాని ముదిమియందు సంతసిలును ఇత్యాదికఫలమగును.

— రాహువు కేతువులుండిన —

వాదించునట్టి సోదరులుందురు కోపియగును ఇత్యాది.

రవ ఇల్లుయగు మకరములో రవియుండిన

పితార్జితముండును సుకీర్తియగును ప్రసిద్ధినొందును ప్రథమ యౌవ్వనమున మాతాపితృహాని యగును.

— చన్ద్రుడుండిన —

పలువిధవాహనములుండును స్థిరముగానుండవు భూస్వామి ధనికుడు మాతామహులు శ్రమనొందింతురు.

— కుజుడుండిన —

పిత్రార్జితముచెడును రుణముండును రోగియగును అర్ధప్రాయమున వంచింపబడును ముదిమియందు శ్రమనొందును,

— బుధుండిన —

ఇతరులఆస్తివల్ల జీవనముండును చేతిపనులు తెల్యును ముదిమియందు రిక్తుడగును

— గురుడుండిన —

ముదిమియందు అదృష్టమును సుకీర్తియు మధురవాక్కులు దాత దేవాలయములు ధర్మశాలలు ఇతరనివాసస్తలముల నిర్మాణముచేయువాడగును.



— శుక్రుడుండిన —

పలువిధ వాహనములుండును పితార్జితముండును రాజభాష తెల్యును మాంత్రికుడగును ముదిమియందు శ్రమపడును సంతతీ సామాన్యమగును.

— శనియుండిన —

పిత్రార్జితహాని రిక్తుడగును దుష్టచర్యలవల్లశ్రమనొందునువిద్య నేర్చియున్నను ఋణస్తుడగును.

— రాహువు కేతువులుండినను —

కృష్ణవర్ణము పలువిధరోగములుండును బంధుప్రియముండదు ముదిమియందు సామాన్యముగు సంతోషము మాతామహుల నష్టము నిర్హేతుకవ్రియము యౌవ్వనమున చాల్పుశ్రమలుండును.

— రవ ఇల్లుయగుకుంభములో రవియుండిన —

పేరొందును కాముకుడు పుత్రహానిప్రాయమధ్యమున ఈశ్రమ యగును రాజభాష తెలిసియుండును.

— చన్ద్రుడుండిన —

విద్యామూలమున కీర్తిల్లును గౌరవశాలి సంతానముండును ముదిమియందు సంతసము భూస్వామి నష్టముగు ఆస్తివ్యాజ్యము చేయునెడల దొరుకును సంపన్నుడగును.

— కుజుడుండిన —

పుత్రులవల్ల పీడింపడు ధనమార్జించును వ్రయముచేయును కోపిదుష్టుడగును.

— బుధుండిన —

సామాన్యమగు సంతతియుండును ఇట్టిసంతానము మొదటిభార్యవల్ల గలుగును చేతిపనులు చేయును గౌరవవంతుడగును.

— గురుడుండిన —

పుత్రహానిధనముసంపాదించునుమళ్లీవ్రయమగును సన్నిహితబంధుహానివల్లచెడిన మనస్సు యగును.

— శుక్రుడుండిన —

స్త్రీసంతతియుండును సోదరియుండును గుణయుతుడును పండితుడు ధనవంతుడు అర్థప్రాయమున రాజువల్లనైనను లేక అధికారులవల్ల కోప

మొందును. — శనియుండిన —

పట్టణస్థులవల్ల ప్రజలవల్లసైన్యముచేతను పూజింపబడును ధనవంతుడగును ఇత్యాది ఫలములు గలుగును

— రాహుకేతువులుండిన —

పుత్రహానియగును మధ్యప్రాయమున దరిద్రుడగును ముదిమియందు శాంతినొందును

—( ౧౨వ ఇల్లుయగు మీనమున రవియుండిన )—

తలిదండ్రులవల్లచింత రోగి అధికశత్రువులుందురు పిత్రార్జితమును చెరుపును అంతమున దొరుకును సా [illegible] సి [illegible]రుడగును.

— చన్ద్రుడుండిన —

మాతామహుల శత్రువగును మధ్యప్రాయమున బీదయగును రుణముండును సేద్యఅదాయము నష్టముగును.

— కుజుడుండిన —

బంధువులు శత్రుత్వకరులు ఋణముండును పిత్రువుల ఆదాయము చెడును చాల్పుగామేధ స్పునపీడ యగును శ్రమనొందును.

— బుధుడుండిన —

మెహపొడ లుండును కృష్ణవర్ణము మధ్యప్రాయమున ఋణముండును.

— గురుడుండిన —

బంధువులేశత్రువు లగుదురు ఎ[illegible]త్తవిద్య యున్నను ఉల్లాస హీనము రుణముండును త్రహనియగును.

— శుక్రుడుండిన —

స్త్రీలవల్లబాధనొందును ఇంటిపనులవల్ల చింతిలును ధనవ్యయమగును ఇత్యాదియగును.

— శనియుండిన —

శత్రువులబాధలజే ఇష్టసిద్ధినొందక కుక్షిరోగియు ఇత్యాది.

—( రాహుకేతువులుండిన )—

రాజువలన లేక అధికారివలన శ్రమకల్గును చరాస్తిహాని స్వగృహమువదలును చింతిలు చుండును.

—( ౧వ ఇల్లుయగు మేషమున రవియుండిన )—

ఉత్తమ వంశజుడగును శ్రీయుతులగు యోగ్యులకు మాతాపిత్రాదు



లుందురు సంపన్నుని కూతురువల్ల పెండ్లియగును మధ్యప్రాయము నుండి పెంపొందును ధనయుతుడగు భూస్వామియగును తోబుట్టువుల మూలము సధనముండును

— చన్ద్రుడుండిన —

స్త్రీలుందురు గౌరవ మొం[illegible] వాడును భాషలునేర్చియుండును ఇవియన్నియు మాతామహుల మూలమున చేకూరును.

— కుజుడుండిన. —

స్త్రీమూలమున ధనముండును పేరును తోబుట్టువువల్ల ధనవృద్ధియగును ఇత్యాదికములు.

— బుధుడుండిన —

సగౌరవుడు భాషాపరిజ్ఞాని గుణవంతుడు భీతియు ధూర్తుడు మేధావి మధ్యప్రాయమున పత్నిహానియగును.

— గురువుండిన —

భార్యతో సంతసిలును అధికప్రాయము న్యాయముగు వ్యవహారియు ఋణస్థుడగును ముదిమియందు సుఖజీవి యగును.

— శుక్రుడుండిన —

దాతయగును సుకీర్తియు పలువిధవాహనము లుండును న్యాయపరిపాలుడగును స్వల్పకాలము ఒకరికి లొంగి యుండును స్వయముగా అధికారియగును మధ్యప్రాయ [illegible]నుండి సంతసిలును.

— శనియుండిన —

అకాలమ[illegible] సౌఖ్యముగును దరిద్రమొందును జీవితకాలమున చాల్పకాలము[illegible] [illegible] సౌఖ్యముగును మధ్యప్రాయమున స్త్రీలతోవంచింప బడును స్త్రీలుందురు

— రాహువుకేతువులుండిన —

పిత్రార్జిత ఆస్తికొరకై చాల్పుగావ్యయమగును జయమొందును ధనికుడగును భార్యవల్ల సంతోషింపదు ముదిమి యందు చిక్కులి సంతసిలును.

— వృషభమున ౨వ ఇంటిలో రవియుండిన —

యావ్వనారంభమున తల్లిదండ్రులు నశింతురు పిత్రార్జితము చెడును వ్యాజ్యములో చిక్కుకొనును మధ్యప్రాయమున విడిపోవును

ఇత్యాది ఫలమగును

— చన్ద్రుడుండిన —

తల్లిదండ్రులయొక్క బంధుహాని అధికశత్రువు లుందురు ఎవ్వనారంభమున శ్రమనొందును అంతమున సంతసిలును స్వల్పప్రాయమగును.

— కుజుడుండిన —

కఠినమరణము నొందును చిక్కులుండును అర్థప్రాయమున సంతోసహీనమగును.

— బుధుడుండిన —

ఆయువు సుఖము లుండును విద్యవల్లలాభముండదు శ్రమనొందును ఇత్యాది.

— గురుడుండిన —

ఆయువు హెచ్చియుండును ఋణమగును ముదిమియందు ధనముండును సంతతియుండును తోబుట్టువు హాని నమ్మించు వాడును.

— శుక్రుడుండిన —

బాల్యమునందు జాడ్యములుండును ముదిమియందు స్వల్పసుఖము గౌరవముండును అర్థప్రాయమగును వంశమున ఆడశిశువుండదు.

— శనియుండిన —

రాజులవలన లేక అధికారివలన శ్రమపడును అర్థప్రాయమున గౌరవము కీర్తియు చెడును ధైర్యముగలవా చాలుడు ఇత్యాది.

— రాహువుకేతువులుండిన —

విషమగు రుగ్మతగాంచును శ్రమలువాటిల్లును ఋణస్థుడగును అధికముగ శత్రువులుందురు ఇత్యాది.

— ౯వ ఇల్లుయగుధనములో రవియుండిన —

తండ్రివైపు బంధువుల కారణమునుండి ధనవ్యయమగును చింతిలును సుఖియగును పిత్రార్జిత ముండును గౌరవమొందును మధ్యప్రాయమున పుత్రహానియగును.

— చన్ద్రుడుండిన —

ఉత్కృష్టగర్భజనితుడగును నమ్మకములేనివాడు న్యాయమగు ధనము ఇతరులసుగుణముల వెల్లడించును స్వల్పముగ ప్రసిద్ధినొందును.



— కుజుడుండిన —

తోబుట్టువులకారణమున ప్రసిద్ధినొందును ముదిమియందు శ్రమపడును ఋణముండును మధ్యప్రాయమున వంచింపబడును కొంతకాలగునకు తిరిగిపోవును.

— బుధుడుండిన —

పిత్రార్జితముఅతిశయిల్లదు దాత సుగుణుడు పండితుడు పనివాడు ముదిమియందు కీర్తిల్లును.

— గురుడుండిన —

దీర్ఘాయువు దాతఉపకారి పనులుఉద్ధరించు నెడల మిక్కిలి ప్రియుడగును ధర్మశాలనిర్మాణము చేయును బీదలకు సజ్జనులకు సహాయుడగును భగవద్భక్తినొందును తోబుట్టువులవల్ల కీర్తిబొందును.

— శుక్రుడుండిన —

వంశకీర్తిబడయును గౌరవింపబడును స్త్రీమూలమున ధనముండును నేర్పరియగుచు సత్యశీలయగు సతియును నూతనాధికారమున కీర్తినొందును ఈ అధికారము యావజ్జీవన ముండును.

— శనియుండిన —

పితృహానియు మాతులహానియునగును ధనముసంపాదించును సంతసిలును ముదిమియందు సంతసిలును.

— రాహుకేతువులుండిన —

వ్యాజ్యములలో చిక్కుకొనును యెవ్వనమున శ్రమలుండును ముదిమియందు సంతసిలును ఇతరులపైఆజ్ఞలుసల్పును ఇతరుల యొక్క ఆస్తిని అక్రమముగ అపహరించును ధనికుడగును పితృహాని యగును శత్రువు లుందురు.

( ౧౦వ ఇల్లు యగుకర్కాటకమున రవియుండిన )

రాజస్థానమున ఘనతగల అధికారియగును గౌరవశాలి కీర్తియుతుడు సద్గుణసంపన్నుడగును.

— చన్ద్రుడుండిన —

ధనికుడు భూస్వామి స్వంతపనినినేర్పుచేచేయునందునకీర్తిల్లును గా

గవముండును. — కుజుడుండిన —

సేవకుడగును అర్ధప్రాయమున బంధువులవల్ల శ్రమలొందును పితార్జితమగు ఆస్తిచెడును — బుధుడుండిన —

వ్యాపారము చేయును. స్వల్పవిద్యయగును ముదిమియందు సుఖియగును ధనముండును. — గురువుండిన —

ప్రధానియగును ఉత్కృష్టలేఖకుడగును సద్గుణములుగలవాడును అదృష్టశాలియు సంతసిలును ఇత్యాదియగును.

— శుక్రుడుండిన —

పలువిధవాహనములుండును మొదటఉపాధ్యాయుడగును పిమ్మట గొప్పఅధికారియగును పైఅధికారులవల్ల గద్దింపబడును విరిగికొందరగ దయగలుగును. — శనియుండిన —

మతమునులక్షింపడు అబద్ధసాక్ష్యమనిచ్చును నమ్మకము చేయడగనివాడగును సంచరించుచుండును.

—(రాహువుకేతువులుండిన)—

బంధుద్వేషియగును గుణహీనుడగును నాస్తికుడగును విద్యనుండును.

[ ౧౧వ ఇల్లుయగుసింహములో రవియుండిన ]

తోబుట్టువులుందురు ధనముండును రాజులవల్ల ధనికులవల్ల గౌరవింపబడును సాహసియగును శూరుడగును పితార్జితముండును.

— చన్ద్రుడుండిన —

సోదరులుందురు చెడిపోయిన ఆస్తివ్యాజ్యముచేయుటచే మళ్ళిదొరకును అర్ధప్రాయమున సంతసిలును.

— కుజుడుండిన —

మధ్యప్రాయమున భ్రాతృహానియగును సంచరించును నిష్కాముడగును లోబడక యుండును.

— బుధుడుండిన —

ప్రతివ్యాపారముచేయును ఋణముండును లోలుడగును కామియు ఇత్యాది. — గురుడుండిన —

సుగుణుడు సుకీర్తియు సంపన్నుడు అర్ధప్రాయమున ఋణియైత్వ



రగాతీరిపోవును ఉపకారియగును తోబుట్టువులవల్లకీర్తిల్లును సంతసిలును.

— శుక్రుడుండిన —

ఒకస్త్రీమూలమున ధనముండును సద్గుణుడై ఒప్పదగినవాడగును ఇత్యాది. — శనియుండిన —

సోదరసంతతిహాని శత్రువులుందురు కీళ్లలో నొప్పులుండును.

— రాహుకేతువులుండిన —

సంతతిహీనమగును శత్రువులుందురు ఋణముండును ముదిమియందు ఋణము తీర్చును. వేదాంతములో నిపుణుడగును

[ ౧౨వ ఇల్లుయగుకన్యలో రవియుండిన )

ముదిమి యందుకీర్తినొందును అధికారియగును కీర్తియును గౌరవమొందును సకలజన సహాయకుడగును.

— చన్ద్రుడుండిన —

భూస్వామియొద్ద అధికారియగును సుఖజీవనముండును మధ్యప్రాయమున కీర్తియును — కుజుడుండిన —

స్వయముగ అధికారియై నిరాటంకముగనుండును ఋణస్తుడగును మధ్యప్రాయమున అదృష్టహాని యగును.

— బుధుడుండిన —

వ్యాపారముచేయును. రాజ్యమున శ్రమపడును అధికారులుదప్పింతురు నష్టములుండును. — గురుడుండిన —

ఉపాధ్యాయుడగును గౌరవమొందును సామాన్యధనముండును ఋణముండును పుత్రదుఃఖముండును ఉపదేశము చేయును లేక గురువగును.

— శుక్రుడుండిన —

సర్వకాలము సంతసిల్లును ధనికుడగును సుందరుడగును గౌరవింపతగినవాడగును. — శనియుండిన —

శ్రమపడును చాంచల్యప్రకృతియు యావ్వారంభమున శ్రమపడును ఆదాయవ్యయములు సమానమగును జన్మాంతము వరకు శ్రమనొందును — (రాహుకేతువులుండిన) —

యౌవన్యోదశమున సిగముగునట్టి ఆదాయముండదు ధనమున వైశ్ర

మలుండును ముదిమియందు అభివృద్ధియు సౌఖ్యము కలుగును.

—(౮ వృశ్చికలగ్నము గురించియు)—

వృశ్చిక లగ్నమందు జనించినవారు మాతాపిత్రాదుల బంధువులను ప్రేమించును లోలుడగును మన్మధచర్యయుతుడు పనులు తెలిసియుండును. వాచాలుడు రసవంతమగు పలుకుబడి ఇష్టసిద్ధికొరకు నిలచి ఫలింపజేసుకునును ౭ సం॥ ౫, ౧౦. ౧౨, ౧౮ సం॥ లలో రోగియగును.

(౧వ ఇల్లుయగు వృశ్చికములో రవియుండిన)

వేడిగల దేహము స్వల్పమగు ఆయువు మాతాపిత్రాదులగురించి చింత శ్రమలుండును. ఎవ్వనమున ధనహానియు తిరిగిధనముండును. శీఘ్ర నొసంగుటకు అధికారముండును లేక సేనలోనైన ఉద్యోగియగును.

—(చంద్రుడుండిన)—.

ఒక్కశరీరియు నమ్మకుండును శ్రమలుండును యౌవ్వనారంభమున అతిశ్రమ ప్రాయమున సంతసిలును అర్ధప్రాయముండును.

—(కు జు డు ం డి న)—

చురుకుగ స్థిరచిత్తుడగును అతిశత్రువులుందురు శత్రువులవల్ల నిందింపబడును. అర్ధప్రాయుడగునువెల్లప్పుడు రోగియగును.

—[బు ధు డు ం డి న]—

పశుప్రియుడగును ఋణస్తుడగును బాల్యమున శ్రమ రోగిగనుండు శరీరియు తోబుట్టువు సంతతిలో క్షేమముండదు నీచదృష్టి అల్ప ప్రాయుడగును.

—(గు రు డు ం డి న)—

ప్రాయముమించియుండును శ్రీయుతుడగును కీర్తిల్లినట్టి వంశజాతకుడగును అంత్యమున శ్రమజెందును న్యాయవాది శుభ్రమగు పలుకు ఉత్తమమగునట్టితర్కము ఇతరుల అభిప్రాయము తెల్యునట్టివాడును ఎంత సంగతియున్నను క్లుప్తముగా వ్రాయుచుండును.

—(శు క్రు డు ం డి న)—

సుందరుడుసు ప్రాయఅంతమున ఒకఅంగమువికలమగును సామాన్యమగు విడివియగును మధ్యప్రాయమున భార్యనుగురించిన శ్రమలుండును. స్త్రీలవిషయమై విశ్వాసహీనుండగును.



—(శ ని యు ం డి న)—

స్వల్పప్రాయమగును పుండ్లచేబాధనొందును కళాహీనుడు దుర్నడత తోబుట్టువునకు హానివర్చోహీనుడగును.

—(రాహువు కేతువులుండిన)—

ఎవ్వనారంభమున మాతాపితృహాని అధికప్రాయము ఎవ్వనారంభమున బేలయగును అంతమున సంతసిలును.

—(౨వ ఇల్లుయగు ధనుస్సులోరవియుండిన)—

కీర్తిల్లును పిత్రార్జితముదొరుకును సంతతిలేమి బంధుహాని వీరలధనమబ్బును ఒప్పదగినమాటయగును భయంకరమగు కన్నులు ధనముండియు ప్రథమాంశకుడగును.

—[చ ం ద్రు డు ం డి న)—

పిత్రార్జితమగు ధనము స్వల్పముగా దొరుకును కష్టమువల్ల ధనముండును నేత్రములనుండి నీరువెడలును స్వల్పదశయుండును తిండిబోతుయగును కఫశరీరియు వాచాలుడగును.

[కు జు డు ం డి న]

చరస్థిరాస్థియుండును వంశశ్రమలుండును చింతిలును అంత్యకాలమున యశముండును వీరుడగును రాజుచేనైనను లేక అధికారులవల్లనో భీతినొందిన వ్రయమగును వ్యాజ్యమునందైనను వ్రయమగును.

—(బు ధు డు ం డి న)—

బొంకుచుండును స్తుతియొనర్చును పౌరాణికుడు భాషాపరిజ్ఞాని అంతమున సంతసియగును ఎవ్వనమున సంతోషహీనము పండితుడగును.

—(గు రు వు ం డి న)—

ధనముండియు కీర్తిల్లడు లోభియగును వక్షస్థలమునందు రోగముండును సత్యశీలుడు ఒప్పదగినమాటలుండును ముదిమియందు నష్టమగును కీర్తిల్లును.

—(శుక్రుడుండిన)—

రుణముండును వర్ణింపదగిన పనులయెడ వ్రయముచేయును అందరితో ప్రేమింపబడును ప్రతివారిని మిత్రునిగాజేసుకునును వెలయాలు లేక వ్యభిచారిణియైన ఇంటిలోనుండును జన్మాంతమువరకు తనను శృంగా

రించుకొనుటకై యోచనచేయును ఇతరులధనమబ్బును.

( శనియుండిన )

ధనవ్రయము చేయును క్రుత్రిముడగును దుఃఖియగును ఋణముండు
ను, అర్ధప్రాయమున సిగ్గువదలును దరిద్రుడగును.

—( రాహువు కేతువులుండిన )—

ఒప్పదగినటులమాటయుండును దాత తొందరచేయుటచే పనులను
చెరుపుకొనును పిత్రార్జితమును చెరుపును ధనమార్జించును లాభముం
డదు కత్తిగాయుండును సార్వకాలము చెడుయోచనలు చేయుచుండును.

( 3వ ఇల్లుయగు మకరములో రవియుండిన )

తోబుట్టువునకై చింతిలును మధ్యప్రాయమున అధికారివల్ల దిగులొందు
ను బుద్ధియొకప్పుడుచాంచల్య మొందక మరియొకప్పుడు చాంచల్యమగును

—[ చంద్రుడుండిన ]—

సోదరియుండును పలువిధవ్యాపారములుండును పనులయందు నేర్ప
రియగును చిత్రపటములు వ్రాయుట తెల్యును పాటతెల్యును మొదట
ధనముండును పిదప చెడును.

—[ కుజుడుండిన ]—

తోబుట్టువులుండరు వ్యాజ్యములలో పాటుబడుటవల్ల దినచర్య
జరుగును మేహపొడలుండును మధ్యప్రాయమున సుఖముండును.

—( బుధుడుండిన )—

కళత్రహానిమరియు సంతతిహానియగును బంధుద్వేషమగును చేతి
పనులుచేయును

-( గురువుండిన )-

సోదరులుందురు ధనముండదు ఆస్తినిగురించిన వ్యాజ్యములుండు
ను సంతతి యుండదు

-( శుక్రుడుండిన )-

బిడ్డలుయుందురు ధనముండును గౌరవమునకై పాటొందును నిష్ప్ర
యత్నముగ ధనముదొరుకును రాజులకు ఉపాధ్యాయుడగును.

—శనియుండిన—

మధ్యప్రాయమున సంతసిలుచు లాభమునొందును తోబుట్టు
వులకుదుఃఖమగు శ్రమయగును స్వయముసంతసిలదు ఇతరదేశ వాసియగు



ను మతభ్రష్టుడగును.

—రాహువు కేతువులుండిన—

సామాన్యముగ తోబుట్టువులుందురు మధ్యప్రాయమున ఉద్యోగ
మువదులుకొనును దుఃఖముమరియు చింతిలుచు మరణమొందును.

— 4వ ఇల్లుయగుకుంభములో రవియుండిన. —

ఎవ్వారారంభమున మాతాపితృ హానియగును మధ్యప్రాయమున
అధికమగును ఉద్యోగముగలుగును అధికారియొక్క భాషలో పూర్తినిపు
ణుడగును బంధువుల ధ్యానముండదు పిత్రార్జితము చెడును.

— చన్ద్రుడుండిన —

ఎవ్వారారంభమున మాతాపితృహానియగును ఇండ్లుభూమియు దొ
రుకును చాలాకాలము వరకు రాజులవద్ద ఉద్యోగముచేయును వ్యాపార
ము చేయును విద్యనుగురించి చింతిలును.

— కుజుడుండిన —

మాతృపితృ హానియగును యుద్ధమునందు వెనుదీయును వాదన
లుచేయును పిత్రార్జితహానియగును మధ్యప్రాయమున తోబుట్టువుహాని
యగును.

— బుధుడుండిన —

గొప్పవిద్వాంసుడగును ఎవ్వారారంభమున లాభమొందడు సం
తసిలునట్టి పనియుండదు మిక్కిలి చిత్రకారకుడగును యంత్రముల పనులు
తెలిసియుండును గుణవంతుడగును యోగాభ్యాసియగును పర్వతగామి
యగును సముద్రయానము చేయును.

— గురువుండిన —

బంధుమూలమున గౌరవింపబడును ఇతరులయొక్క వాహనముల
వల్ల పనిగొనును సుతులుందురు ధనముండును.

— శుక్రుడుండును —

ఋణముండును స్త్రీమూలముగ ధనముదొరుకును కళత్రహానియ
గును సముద్రయానము చేయును కొంతకాలము వరకు సంతసిలదు.

— శనియుండిన —

పురాతనమగు ఇండ్లుకొనును కృత్రిమముచే ధనమార్జించును
తల్లితండ్రులకు సహాయము చేయకుండును ఇత్యాదిఫలమగును.

— రాహు కేతువులుండిన —

బొంకుచుండును పలువిధములధన మార్జించును మళ్లి వ్రయమగును అధికారులవల్ల లజ్జనొందును ద్రిమ్మరి యగును పలువిధముల జీవనము గడుపును.

— ౪వ ఇల్లుయగుటవిూనములో రవియుండిన —

పుత్రహానియగును నేత్రరోగముండును అధికఉద్యోగమువుండును మధ్యప్రాయమున ధనవ్రయమగును మాతాపితృహానియగును పిత్రార్జితము నష్టమగును భేదముచెందును.

— చ న్ద్రు డు ం డి న —

పలువిధములచే జీవనాధారమగును వ్యాపారమువల్ల లాభమగును చాలామట్టుకు ఆడపిల్లలుందురు మొదటరాజోద్యోగముండును త్వరలోవదలిపోవును.

— కు జు డు ం డి న —

పిత్రార్జితముచెడును ముదిమియందు యౌవ్వనవంతుడగు పుత్రహానియగును మాంత్రికుడగును కుత్రిమమువల్ల సంపాదించును స్వల్పముగ సంతసిలును.

— బు ధు డు ం డి న —

సద్గుణుడు ఘనతనొందిన విద్వాంసుడగును వీటివల్లలాభించదు సుతులుండరు.

— గు రు డు ం డి న —

న్యాయ సభావిద్య నేర్చియుండును యోగియగును చాంచల్యస్వభావము కోరికనొందదు ఎవ్వనారంభ మునుండి అంతమువరకు అభివృద్ధినొందును.

— శు క్రు డు ం డి న.

సుందరియగు ధనవంతునికుమార్తెతో పెండ్లియగును అట్టిస్త్రీమధ్యప్రాయమున హానియగును నమ్మతగినవాడగును సముద్రసన్నిధి నుండు పట్టణ వాసుడగును సముద్రయానముచేయును రాజభాష తెలిసియుండును.

— శ ని యు ం డి న —

పుత్రహానియగును విద్యవలన లాభముండుదు మాతాపిత్రాదుల శత్రువగును మోసముచే ధనముం సంపాదించును.

— రాహువు కేతులుండిన —

కాముకుడగును పుత్రహాని యగును నాస్తికుడగును మత్తుడగును ద్రాగుబోతుమధ్యప్రాయమగు నప్పుడు నష్టపడును.



— ౧వ ఇల్లుయగు మేషములో రవియుండిన —

కొంతకాలము పిత్రార్జితముండునుఅంత్యమున జయమగును యెవ్వనారంభమున మాతాపితృహానిఋణముండును అతిదుర్బలశరీరియగును

— చ న్ద్రు డు ం డి న —

రోగియగు భార్యయుండును కఫశరీరియగును యెవ్వనారంభమున మాతృహాని యగును. స్త్రీలను గురించిన వాదనలుండును.

— కు జు డు ం డి న —

అపరిశుద్ధరక్తముచే రుగ్మత యుండును బంధువులచే ప్రేమనొందదు మధ్యప్రాయమున అధికారులవల్ల నష్టమగును.

— బు ధు డు ం డి న —

సకలజనులవల్ల ప్రేమింపబడును ఋణముండును ప్రతివిద్యలో కొంత తెలసియుండును. యెవ్వనారంభమున ఎత్తుగల ప్రదేశమునుండి పడినందున దెబ్బతగిలిన గురుతుయుండును.

— గు రు డు ం డి న —

ఋణముండును దొబ్బతోగురించిన రుగ్మతనుండును స్వల్పప్రాయమగును ఆస్తియుండియు దీనివల్ల ఇసుమంతైనను లాభముండదు.

— శు క్రు డు ం డి న —

భార్యలుందురు ప్రేమింపతగిన వారుకారు ఇతర దేశవాసి యగును మేహపోడలుండును ఇత్యాదికలుగును.

— శ ని యు ం డి న —

కీళ్ళలోనొప్పులుండును సంతతిహీనమగును అధికముగ సంపాదించును ఇత్యాదియగును

— రాహు కేతువులుండిన. —

అధికారివల్ల శ్రమనొందును విషజంతువులచే బాధకలుగును త్రువులుండినందున ఇతర దేశమునందున సంచరించును.

౨వ ఇల్లుయగు వృషభములో రవియుండిన

దొంగలించునట్టి సతియుండును చాల్పుగాశత్రువులుందురు వ్యాజ్యాఘునడచిన పిమ్మట పిత్రార్జితము దొరుకును భాగ్యవంతులవల్ల సహాయమున లాభమగును ఉద్యోగము కలుగును మధ్యప్రాయమున సంత

[ ౯వ ఇల్లుయగు ధనస్సులో రవియుండిన )

ఘనత వహించును మాతాపితృలు రిక్తులగుదురు ధూర్తవగును ఉపాధ్యాయుడగును మోహకుడు ముదిమియందు పుత్రహాని సుకీర్తి మధ్య ప్రాయమున కీర్తిల్లును.

—( చన్ద్రుడుండిన )—

రోగియగును పిత్రార్జితమగు ఆస్తితగ్గియుండును చాల్పుగా నేర్పి యుండును పుత్రహానియగును.

—( కుజుడుండిన )—

శిక్షించునట్టి అధికారము ముండును సంచరించును ధనముండును మధ్యప్రాయమున దీనమొందును.

—( బుధుడుండిన )—

ఉత్తమమగు విద్యయుండును మరియు అందులో ఉత్తీర్ణుడై యుండును లుబ్ధుడు ధనముండును.

—( గురువుండిన )—

తర్క శాస్త్రము మరియు న్యాయశాస్త్రము నేర్చియుండును. ధనముండును గౌరవమును కాపాడుకొనును సుగుణుడగును శ్లాఘింపదగిన పనులుచేయును అధికప్రాయమగును.

—( శుక్రుడుండిన )—

వాహన లాభమగును కీర్తిలును కృతిముడగును అకారణముగ వ్రయమగును.

—( శనియుండిన ]—

మధ్యప్రాయమున దీనత్వమొందును స్థిరమగుధన ముండదు సంతసిలడు నాస్తికుడగును.

—( రాహుకేతువులుండిన )—

నాస్తికుడగును సహాయముచేయును స్థిరమగు పనియుండదు.

—(౧౦వ ఇల్లుయగు మకరములో రవియుండిన)—

ఆస్తిచెడును భార్యపుత్రుల హానియగును నేత్రరోగమైనను శిరోవ్యాధియైనను కలుగును.



— చన్ద్రుడుండిన —

పుత్రులుందురు కళత్రహాని సంచారి మృదుభాషియగును.

—( కుజుడుండిన )—

ధనముండును కొంతచెడును భార్యవుండదు రోగియగును.

—( బుధుడుండిన )—

గణితశాస్త్రి స్వల్పఆదాయమగు నటిస్థిరాస్థి యగును

—( గురువుండిన )—

ధనహీనము స్వల్పకాలము ఉపాధ్యాయుడగును ఉద్యోగము చిక్కను మించియుండదు.

—( శుక్రుడుండిన )—

స్త్రీలుందురు రోగి ఋణము యెవ్వనమున పుత్రహాని తోబుట్టువుహాని.

—( శనియుండిన )—

పుత్రలోపము ఉల్లాసహాని ముదిమియందు స్థిరమగునట్టి పనియుండదు నీచకొనజేయును.

—( రాహువుకేతువుండిన )—

మంచిన్యాయశాస్త్రము తెల్యును దుష్టవ్యాపారమువల్ల దినచర్యయగును సుగుణుడు అధికమగు శత్రువులుందురు.

— ౧౧వ ఇల్లుయగు కుంభములో రవియుండిన —

సంచరించును ముదిమియందు సంతసిలడు ఆశయుండును.

చన్ద్రుడుండి

చాలాసంతసిలడు ఆస్తిచెడును ఇట్టిజాతకుడు పుట్టుటకు పూర్వము మాతాపిత్రాదులు సుఖింతురు వీనిజీవితకాలమువరకు మంచిస్థితి నుండదు రోగియగును.

— కుజుడుండిన —

ఎవ్వనమున ఉల్లాసము హీనము అధికముగ ఆర్జించును నష్టపడును మధ్యప్రాయమున దీనత్వమగును.

— బుధుడుండిన —

అధికముగ ధనముండదు స్వల్పవిద్యయగును అభివృద్ధి గాంచును

ఉల్లాసహీనము అగును.

— గురుడుండిన —

మధ్యప్రాయమగును దాతలేక ఉపకారి సర్వజనయిష్టుడు కీర్తిలును ఇతరదేశవాసి సుగుణి ఉల్లాసలోపము.

— శుక్రుడుండిన —

అధికముగ ధనముండదు సంతసిలును ఋణముండును పలువిధములగు జీవనాధారమగును మధ్యప్రాయమున కళత్రహాని యగును.

— శనియుండిన —

లుబ్ధుడు ధూర్తు అవివేకి క్రూరత్రిముడు ఉల్లాసహీనము.

— రాహువుకేతువుండిన —

సంచరించునట్టి ఉద్యోగము దొరకును ముదిమియందు సంతసిలును పిత్రార్జితమునకై వ్యాజ్యములుండును అధికారులభీతి యగును త్వరలో మంచియగును.

## ద్వాదశభావ ఫలస్వమాప్త:

సూర్యుడు మేషాది రాసుల యందుండగా ఫలము ౧ మేషరాశియందు సూర్యుడుండగా బుట్టినవాడు ప్రఖ్యాతుడును నేర్పరియును తిరిగెడువాడును స్వల్పధనము గలవాడును శస్త్రమును ధరించిజీవనము చేయువాడును అగును ఈఫలము మేషరాశి యందుండు సూర్యుడుతన పరమోచ్చభాగమునకు పైన(౨౧) భాగములలోనున్నపుడు గలుగునని తెలియవలెను. పరమోచ్చ భాగలయందు రవియుండగా బుట్టినమనుజుడు బహుధనవంతుడును ఆయుధధరులచే సేవింపబడువాడును ప్రఖ్యాతుడును నేర్పరియును అగునని తెలియవలెను. జా॥ మా॥ రీత్యా,

౨. వృషభమందు సూర్యుడుండగా బుట్టినవాడు వస్త్రములును గంధ ద్రవ్యములు క్రయవిక్రయములు చేసి జీవించువాడును స్త్రీద్వేషియు గాన వాద్యములయందు సమర్థుడును అగును. జా॥ మా॥ రీత్యా.

3. మిధునరాశి యందు సూర్యుడుండగా పుట్టినవాడు వ్యాకర్ణజ్ఞుడును ధనికుడును అగును.



౪. కర్కటరాశియందు సూర్యుడుండగా పుట్టినవాడు తీవ్రమైన వాడును దరిద్రుడును పరులకార్యములను చేయువాడును తోవనడుచుటచే శ్రమగల వాడును దుఃఖములు అనుభవించు వాడును అగును. జా॥ మా॥ రీత్యా॥.

౫. సింహరాశియందు రవియుండగా బుట్టినవాడు అరణ్యపర్వత గోవాటి కలయందు అనురాగముగలవాడును బలవంతుడును మూర్ఖుడును అగును జా॥ మా॥ రీత్యా॥.

౬. కన్యారాశియందు సూర్యుడుండగా బుట్టినవాడు అక్షరములు వ్రాయుటయందును. చిత్రరూపులు వ్రాయుట యందును కవిత్వము చెప్పుటయందును గణితము చేయుటయందును ఆత్మజ్ఞానము తెలిసికొనుట యందును. సమర్థుడగును మరియు స్త్రీతుల్యశరీరుడును అగును
జా॥ మా॥ రీత్యా.

౭. తులారాశియందు సూర్యుడుండగా పుట్టినవాడు మద్యపానాసక్తుడును మద్యమువిక్రయించు వాడును త్రోవనడుచుటయందు ఆశక్తిగలవాడు స్వర్ణకారుడును అనుచితకృత్యములు చేయువాడును అగును. జా॥ మా॥ రీత్యా.

౮. వృశ్చికరాశియందు సూర్యుడుండగా పుట్టినవాడు ఉగ్రస్వభావుడును. యుక్తాయుక్త విచారము సేయక ధైర్యముచేత సాహసకృత్యములు సేయువాడును. విషప్రయోగముచేత సంపాదింప బడిన ధనముగలవాడును. శస్త్రవిద్యాపారగుడును. శిక్షకుడును నాశకుడును అగును. జా॥ మా॥ రీత్యా.

౯. ధనూరాశియందు సూర్యుడుండగా బుట్టినవాడు సత్పురుషులచేతపూజింపదగినవాడును. ధనికుడును కోపవంతుడును వైద్యక్రియాదక్షుడును శిల్పకర్మ తెలిసినవాడును అగును. జా॥ మా॥ రీత్యా.

౧౦. మకరరాశియందు సూర్యుడుండగా బుట్టినవాడు. కులోచితముగాని కృత్యములు చేయువాడును. మూర్ఖుడును కుచ్చితబేరము చేయువాడును. స్వల్పధనము గలవాడును. లోభవంతుడును పరులభాగ్యము ననుభవించువాడును అగును

౧౧. కుంభరాశియందు రవియుండగా బుట్టినవాడును. అధమకృత్యములు చేయువాడును. పుత్రులచేతను భాగ్యముచేతను. విడువబడు వాడునుఅగును. జా॥ మా॥ రీత్య,

౧౨ మీనరాశియందు సూర్యుడుండగా బుట్టినవాడు. నీటియందు వుత్పత్తియగు ముత్యములు మొదలగువాని క్రయవిక్రయములుచేసి అందువల్లలభియించు ఐశ్వర్యముఃగలవాడును స్త్రీలచేత ఆదరింపబడు వాడును అగును. జా॥ మా॥ రీత్య (చంద్రుడు మేశాదిరాసుల యందుండగా ఫలము).

(౧. మేషరాశియందు చంద్రుడుండునపుడు).

వర్తులములై అంతట నెరసినగు కన్నులుండును వుష్ణపదార్ధము నందిష్టుడు. శాకభక్షకుడు అల్పహారి తమ కోపకాలమున శీఘ్రముగా సుఖుడగును. స్త్రీలోలుడు బలహీనుడు స్త్రీలకు ప్రియుడు సేర్వగా పరులను గొలుచును గోళ్లుపుచ్చియుండును కురుపులచిహ్నములునెత్తినయుండును గర్వియు అందరు తోబుట్టువులకంటె పెద్దయగును అరచేతియందు శక్తిరేఖయుండును చపలుడు నీటిలోభయపడును దిగులొందు వాడగును. జా॥ మా॥ రీత్య.

౨ వృషభమునందు చంద్రుడుండిన.

విలాసగమనుడు విస్తీర్ణమగుతొడలు ముఖముగలవాడు మూపులుగలవాడును దుఃఖముసహించువాడు స్త్రీజనకుడు వీపున లేక ముఖమున ప్రక్కలయందు మచ్చలుండును కఫశరీరి మొదటి బంధుధన పుత్రుల నెడబాయును సౌభాగ్యుడగును ఓర్పుగలవాడు ఆకలినొందువాడు వనితావల్లభుడు ధృఢశరీరము ఎల్లప్పుడు సౌఖ్యపడును. జా॥ మా॥ రీత్య.

(3 మిధున రాశియందు చంద్రుడుండిన)

స్త్రీలఅభిలాషించును కామశాస్త్రశేర్వరిగ క్తనేత్రములుపండితుడు న్యాయభాషి వక్రమగు వెంట్రుకలు చతురుడు అపహాస్యప్రియుడు ఇతరులమనోభావము తెల్యును నగు మొగము సరసమైన అవయవములు ప్రియభాషి బహుతిండిపోతు గానలోలుడు నాట్యము తెలసినవాడు మంచిముక్కు వండులతో క్రీడించును. జా॥ మా॥ రీత్య.



[౪ కర్కాటకమందు చంద్రుడుండిన)

కుటిలుడు తొందరగా నడుచును ఉన్నతమగు జఘనములు మంచిస్నేహితు లుందురు. జ్యోతిశాస్త్రము తెల్యును గృహములుండును ఆదాయవ్రయము సమానము కురుచయగును ధృడమగు బలసినకంఠము వనములయందు జలమునందు ఆసక్తియగును. జా॥ మా॥ రీత్య.

(౫ సింహరాశియందు చంద్రుడుండిన)

ఉబ్బినచెంపలువిశాలమైనముఖము పచ్చనికన్నులు స్వల్పసంతానము స్త్రీలకుశతృవు మాంస అరణ్య పర్వత ఇష్టుడు నిష్కారణమగు కోపము మనుసుచే ఆకలిచేదాహము వలన కడుపునొప్పివలన పలునొప్పి వలన బాధయగును పరాక్రమ నిశ్చలమనుసు అహంకారుడు తల్లిమాట వినును. జా॥ మా॥ రీత్య.

[౬ కన్యారాశియందు చంద్రుడు )

దేవబ్రాహ్మణ సాధువులను పూజించును లజ్జయుసుందర మగునట్టిదృష్టియగును సుఖముండును మృదుశరీరము నిజమగుపలుకు ఆటపాటలయందు లేఖనాదిపనులలో నిపుణుడు శాస్త్రార్ధము తెల్యును ధారణాసక్తియగుబుద్ధి కాముకుడు లోలుడుఇతరధనము ఇతరగృహముల యందాశక్తి సంచారియగును ప్రియభాషి సంతానముండును. జా॥ మా॥ రీత్య.

[౭ తులారాశియందలి చంద్రుడు]

ప్రజ్ఞగలవాడును పరదారాద్యభిలాష లేక పరిశుద్ధుడైయుండు వాడును స్త్రీవశవర్తియును మిక్కిలిపొడవైనవాడును అత్యున్నతమైన ముక్కు గలవాడును పరిభ్రమణశీలుడును కృశమైచలించెడు దేహముగలవాడును ధవయుక్తుడును అపరి పూర్ణములగు అవయవములు గలవాడును. క్రియ విక్రయముల యందు సమర్థుడును మొదటి పేరుగాక తనప్రజ్ఞసభాసదులయందు గనపరచి రెండవపేరును. సంపాదించు వాడును రోగయుక్తుడును. స్వజనుల కుపకారము చేయువాడును బంధువులచేత తిరస్కరింపబడినవాడును. జా॥ మా॥ రీత్య.

(౮ వృశ్చికరాశియందు చంద్రుడుండిన)

విశాలమైన కన్నులుగలవాడును వక్షస్థలమునుగలవాడును. వర్తులమైన పిక్కలు తొడలు మోకాళ్ళునుగలవాడును. తల్లిదండ్రులచేతను. ఆచార్యునిచేతను విడువబడిన వాడును. బాల్యమందు వ్యాధిపీడితుడును రాజపూజ్యుండును పింగళాక్షుండును క్రూరస్వభావముగల వాడును. పాదములయందు మత్స్యవజ్ర పక్షిరేఖలు గలవాడును. దాచబడిన దోషములుగలవాడును అగును. జా॥ మా॥ రీత్యా.

(౯ ధనూరాశియందు చంద్రుడుండిన)

అతిదీర్ఘములయిన కంఠము ముఖము శిరస్సుగల వాడును పిత్రార్జితమైన ధనముగల వాడును, దాతయును, కావ్యముచదివిన వాడును, బలవంతుడును, మాటలాడుటయందు నేర్పుగలవాడును, గొప్పవయిన చెవులును క్రిందిపెదవియు, ముక్కునుగల వాడును బహు కార్యసమర్థుడును, లిపి, పుస్తక చిత్రలేఖనాదివేత్తయు, పొట్టిమూపులు గలవాడును, పుచ్చినగోళ్లుగలవాడును, బలిసిన భుజములుగలవాడును. మిక్కిలి పౌరుషముగలవాడును, ధర్మమార్గ మెఱింగినవాడును. బంధుద్వేషియు, బలాత్కారమునకు లొంగనివాడును, సామోపాయముచేత సాధింపబడ తగినవాడును అగును. జా॥ మా॥ రీత్యా

(౧౦ మకరరాశియందు చంద్రుడుండిన)

ధర్మముచేసెదనని బొంకి ధనమార్జించువాడును, కృశించిన తొడలు మొదలు క్రింది అవయవములుగలవాడును చెప్పినమాత్రమున గ్రహించువాడును సౌభాగ్యసంపన్నుడును ఆలస్యవంతుడును, చలికినోర్వలేనివాడును. తిరిగెడు స్వభావముగలవాడును, బలాధికుడును. కవిత్వముచెప్పువాడును, అతిలోభియును హీనజాతి స్త్రీలయందున్ను వృద్ధస్త్రీలయందున్ను ఆసక్తిగలవాడున్ను సిగ్గులేనివాడున్ను దయలేనివాడున్ను అగును. జా॥ మా॥ రీత్యా.

(౧౧ కుంభరాశియందు చంద్రుడుండగా)

బుట్టినవాడు ఒంటెమెడవలె పొడవయిన వంకరయైన మెడగలవాడును పుచ్చినవరములుగలిగినట్టియు కఠినమైనట్టియు మిక్కిలి రోమ



ములతోగూడినట్టియు అత్యంతోన్నతమైనట్టియు శరీరముగలవాడును గొప్పవగు పాదములును తొడలును వీపును నితంబస్థానము నోరును గలవాడును పరదారాధనములయందును పాపకర్మలయందును ఆసక్తిగలవాడును వకప్పుడు లేమిడితోను మరియొకప్పుడు సంపదతోడను గూడుకొనినవాడను పుష్పముల యందును గంధాదిలేపనముల యందును స్నేహితుల యందును ప్రీతిగలవాడును మార్గమందు క్లేశమును సహించువాడునగును జా॥ మా॥ రీత్యా.

౧౨ మీనరాశియందు చంద్రుడుండగా బుట్టినవాడు జలమునందుబుట్టిన ముత్యములు మొదలయిన వస్తువులను క్రయవిక్రయములుచేశి సంపాదించిన ధనముగలవాడును. పరద్రవ్యములను అనుభవించువాడును భార్యయందును వస్త్రములయందును అనురాగము గలవాడును కాంతియుక్తమయిన దేహముగలవాడును పున్నతమైన ముక్కునుగొప్పతలయు గలవాడును శత్రువులను తిరస్కరించువాడును స్త్రీలోలవర్తియును అందమైన కన్నులుగలవాడును కాంతివిశేషము ధనమువినియొక్క అనుభవముగలవాడును శాస్త్రము తెలసినవాడును అగును

(కుజుడు మేషాది రాసులలోనుండగా ఫలము.

౧ మేషరాశియందు కుజుడుండగా బుట్టినవాడు రాజపూజితుడును పరిభ్రమణశీలుడును క్రయవిక్రయము తెలశినవాడును ధనవంతుడునుగా యముతగిలి మచ్చలేర్పడు శరీరముగలవాడును దొంగయును అధికమయిన విషయాశక్తిగలవాడును అగును. జా॥ మా॥ రీత్యా.

(౨ వృషభరాసియందు కుజుడుండిన)

స్త్రీవిధేయుడు బంధుమిత్రులయడ క్రూరుడు పరస్త్రీరతుడు ఇంద్రజాలికుడు మంచివేషముగలవారిని స్నేహితహితులను జనింపజేయువాడు అగును. జా॥ మా॥ రీత్యా.

[౩ మిధునరాసియందు కుజుడుండిన]

పరులకు సహింపతగని తేజస్సు సంతానముండును మిత్రలోపము ఉపకారమునకు ప్రత్యుపకారముచేయును గానమునందు యుద్ధమునందు సమర్థుడు కార్పణ్యాదుభయమొందును యాచకుండగును. జా॥ మా॥ రీత్య

(౪ కర్కాటకములో కుజుడుండిన)

ధనికుడు సముద్ర యానముచేత సంపాదింపబడు ధనముగలవాడు పజ్ఞగలవాడు అంగహీనుడు దుర్జనుడు జా॥ మా॥ రీత్య

(౫ సింహరాశిలో కుజుడుండిన)

దరిద్రుడు కష్టముసహించును అడవిలో సంచరించును మితదారాపుత్రులు ఇత్యాదిఫలము జా॥ మా॥ రీత్య

(౬ కన్యారాశిలో కుజుడుండిన)

ఉపకారముమరువక ప్రత్యుపకారముచేయును పుత్రవంతుడు మిత్రరహితుడు ఇతరులను చూచిసహించడు గానప్రియుడు కార్పణ్యము గలవాడు జా॥ మా॥ రీత్య

(౭ తులారాశియందు కుజుడుండిన)

పరస్త్రీఆసక్తుడు ఇంద్రజాలికుడు బంధుమిత్ర క్రూరుడు స్నేహరహితుడు వేషధారులను భయపెట్టును జా॥ మా॥ రీత్య

(౮ వృశ్చికరాశియందు కుజుడుండిన)

సేనాపతి పరిభ్రమ శీలుడు రాజపూజితుడు దొంగ అధికవిషయాసక్తుడు గాయములమచ్చలు శరీరముపైన నుండును జా॥ మా॥ రీత్య

(౯ ధనురాశియందు కుజుడుండిన)

అధికశత్రువులుండును రాజమంత్రి ప్రఖ్యాతిభయములేనివాడు స్వల్పసంతానము

౧౦ మకరరాశియందు కుజుడుండిన)

అధికధన పుత్రులుందురు రాజుయగును లేకున్నను రాజసమానుడగును.

(౧౧ కుంభరాశియందు కుజుడుండిన)

సర్వదాదుఃఖము దరిద్రము సంచారి బొంకువాడు క్రూరుడు అగును

(౧౨ మీనరాశియందు కుజుడుండిన)

మంత్రియగును నిర్భయుడు ప్రఖ్యాతినొందును స్వల్పసంతానముండును

౧ మేషరాశియందు బుధుడుండిన

జూదరి అప్పుచేసి వ్రయముచేయును త్రాగుబోతు నాస్తికుడు పరలోకమును ఒప్పుకుండును దొంగయగును చెడుభార్యయగునుకపటి బొంకును దరిద్రుడు.



౨ వృషభమునందు బుధుడుండిన

ఉపదేశకర్త పుత్రులుందురు భార్యలుందురు ధనార్జనమునకై ఇష్టము మాతాపితృలు ఆచార్యులయందిష్టుడు.

౩ మిథునరాశియందు బుధుడుండిన

అసత్యుడు వ్యాకరణమొదలగు శాస్త్రములు తెలసినవాడు గీతకళావిద్యలయందుచతురుడు సుభాషియు సుఖముకోరును

౪ కర్కాటకములో బుధుడుండిన

ఉదకముచేత పరాక్రముచేత సంపాదించునట్టి ధనముండును స్వజనవిరోధియగును

౫ సింహరాశియందు బుధుడుండిన

స్త్రీలకు ఇష్టముండదు ధనముండదు పుత్రవర్జితుడు సంచరించును మూర్ఖుడు వనితాభిలాషి తిరస్కరింపబడువాడు అగును

౬ కన్యారాశియందు బుధుడుండిన

దాత పండితుడు అధికవిద్యలు శౌర్యముగలవాడు సుఖముండును నేర్పరి యుక్తిగలవాడు భయమొందడు

౭ తులారాసియందు బుధుడుండిన

దారాపుత్రులుందురు ధనముండును మాతాపిత్రఆచార్యులయందిష్టుడు దాత ఉపదేశముచేయును,

౮ వృశ్చికములో బుధుడుండిన

అప్పుచేసి వ్రయముచేయును జూదరి త్రాగుబోతు నాస్తికుడుచెడు భార్యబొంకును దొంగదరిద్రుడు.

౯ ధనురాశియందు బుధుడుండిన

రాజపూజితుడును విద్వాంసుడునువ్యవహారార్థ నెరిగి చక్కగా బలుకు వాడగును.

౧౦ మకరరాశియందు బుధుడుండిన

పరప్రేష్యుడును. దరిద్రుడును సిల్పకర్మలయందాశక్తిగలవాడును అప్పుచేయువాడును వెట్టిపనులుచేయువాడును అగును.

౧౧ కుంభరాశియందు బుధుడుండిన

దరిద్రుడును అప్పుచేయువాడును వెట్టిపనులు చేయువాడును పరప్రేష్యుడును శిల్పకర్మలయందాశక్తిగలవాడును అగును.

౧౨ మీనరాశియందు బుధుడుండిన

సేవకులచేత జయింపబడువాడును చర్మపాదుకా నిర్మాణాదినీచ కర్మలుచేయువాడును అగును

గురుడు మేషాదిరాసులయందుండగాఫలము.

౧ మేషరాశియందు గురుడుండిన

సేనానాయకుండను బహుధనపత్నిపుత్రులుగలవాడును దానశీలుడును మంచిభృత్యులు గలవాడును ఓర్పుగలవాడును కాంతిగలవాడును కళత్రసౌఖ్యము గలవాడును ప్రసిద్ధుడును అగును

౨ వృషభరాశియందు గురుడుండిన

స్వస్థదేహుండును సుఖముగలవాడును ధనపుత్రమిత్రులు గలవాడును దానసీలుడు సర్వజనప్రియుడును అగును

3 మిథునరాశియందు గురుడుండిన

అనేకులయిన పుత్రమిత్రులును పరివారమును గలవాడును మంత్రిత్వమందు నియోగింపబడినవాడును సుఖవంతుడును అగును

౪ కర్కాటకరాశియందు గురుడుండిన

నవరత్నములుగలవాడును పుత్రులుగలవాడును భార్యయు ఐశ్వర్యముగలవాడును మంచిబుద్ధిగలవాడును సౌఖ్యముగలవాడును అగును

౫ సింహరాశియందు గురుడుండిన

సేనాపతియగును ఇదిగాక కర్కాటకమందున్న గురునకు నేఫలము చెప్పబడియున్నదో సింహరాశియందున్న గురునకు అదియే కలుగును



—( ౬ కన్యరాశియందు గురుడుండిన )—

సుఖవంతుడును మంత్రిత్వమందు నియోగింపబడినవాడును అనేకులయిన పరివారమును పుత్రమిత్రులుగలవాడును అగును.

—[ ౭ తులరాశియందు గురుడుండిన ]—

సర్వజనప్రియుడున్ను దానసీలుడున్ను ధనపుత్రమిత్రులు గలవాడున్ను సుఖముగలవాడున్ను స్వస్థదేహుడున్ను అగును

—( ౮ వృశ్చికరాశియందు గురుడుండిన )—

సుప్రసిద్ధుడును కళత్ర సౌఖ్యముగలవాడున్ను కాంతివంతుడును ఓర్పుగలవాడును మంచి భృత్యులుగలవాడున్ను బహుధనపత్నీ పుత్రులు గలవాడున్ను అగును

—( ౯ ధనురాశియందు గురుడుండిన )—

మండలాధిపతియైనను రాజమంత్రియైనను సేనా నాయకుడైనను కేవలము ధనవంతుడైనను అగును

—( ౧౦ మకరరాశియందు గురుడుండిన )—

కులానుచితకృత్యములు జేయువాడును స్వల్ప ధనవంతుడున్ను దుఃఖితుడున్ను అగును

—( ౧౧ కుంభరాశియందు గురుడుండిన )—

నవరత్నములను సంపాదించువాడును పుత్రులుగలవాడును సౌఖ్యముగలవాడును భార్యయు నైశ్వర్యములు గలవాడును మంచిబుద్ధిగలవాడును అగును

—( ౧౨ మీనారాశియందు గురుడుండిన )—

కేవలధనవంతుడైనను సేనానాయకుడైనను రాజమంత్రియయినను అగును బలాబలములను యోచించి ఫలములు చెప్పవలెను

( శుక్రుడు మేషాదిరాసులయందుండగా ఫలము )

—( ౧ మేషరాశియందు శుక్రుడుండిన )—

పరస్త్రీలోలుడును పరస్త్రీలయూరడింపుమాటలుచేత నపహరింపబడిన ధనముగలవాడును కులనిందితుడు అగును

—[ ౨ వృషభరాశియందు శుక్రుడుండిన ] —

తనబలముచేతను బుద్ధిచేతను సంపాదింపబడిన ధనముగలవాడును రాజపూజ్యుడును తనవారిలో ముఖ్యమైనవాడును ప్రసిద్ధుడును నిర్భయుండును అగును

—( ౩ మిథునరాశియందు శుక్రుడుండిన )—

రాజకార్యములను చేయువాడున్ను ధనవంతుడున్ను శీతవాద్యములు తెలిసినవాడున్ను అగును

( ౪ కర్కటరాశియందు శుక్రుడుండిన )

ఇద్దరు భార్యలుగలవాడును యాచకుడును భయశీలుడును అధికమైన మద దుఃఖముగలవాడున్ను అగును

—[ ౫ సింహరాశియందు శుక్రుడుండిన ]—

స్త్రీవల్లవచ్చిన ధనముగలవాడున్ను మంచిస్త్రీగలవాడును స్వల్పపుత్రులుగలవాడును అగును

—( ౬ కన్యారాశియందు శుక్రుడుండిన )—

మిక్కిలి నీచకృత్యములుచేయువాడు అగును

—( ౭ తులారాశియందు శుక్రుడుండిన )—

నిర్భయుండును ప్రసిద్ధుడును తనబంధువులలో ముఖ్యమైనవాడున్ను రాజపూజ్యుడున్ను తనబలముచేతను బుద్ధిచేతను సంపాదించబడిన ధనముగలవాడును అగును

—[ ౮ వృశ్చికరాశియందు శుక్రుడుండిన ]—

కులనిందితుడును పరస్త్రీల యూరడింపుమాటలచే నపహరింపబడిన ధనముకలవాడును పరస్త్రీలోలుడు అగును

—[ ౯ ధనూరాశియందు శుక్రుడుండిన ]—

సద్గుణములచేత పూజింపబడి తగినవాడున్ను ధనవంతుడున్ను అగును

—( ౧౦ మకర రాశియందు శుక్రుడుండిన —

సర్వజనప్రియుడును స్త్రీవశవర్తియును దుష్ట స్త్రీలను రమించు



వాడును అగును —( ౧౧ కుంభరాశియందు శుక్రుడుండిన )—

దుష్టస్త్రీలను రమించువాడును స్త్రీవశవర్తియును సర్వజనప్రియుడును అగును

—( ౧౨ మీనరాశియందు శుక్రుడుండిన )—

పండితుడును ధనికుడును రాజపూజితుడును సర్వజనవల్లభుడును అగును

—( శని ఫలము )—

—( ౧ మేషరాశియందు శనియుండిన )—

మూర్ఖుడును తిరిగెడువాడును కపటముగలవాడును మిత్రులు లేనివాడును అగును

—( ౨ వృషభరాశియందు శనియుండిన )—

అగమ్యాగమ్యము నందిష్టముగలవాడును అల్పైశ్వర్యము గలవాడును అనేక భార్యలు గలవాడును అగును

—( మిథున రాశియందు శనియుండిన )—

లజ్జలేనివాడును ధనములేనివాడును పుత్రహీనుడును చిత్రరువులు వ్రాయుటయందు సమర్థుడును రక్షణాధికారియును ప్రధాననాథుడును అగును. —( ౪ కర్కటరాశియందుశనియుండిన )—

దరిద్రుడును దంతపటుత్వము లేనివాడును తల్లిలేనివాడును పుత్రహీనుడును మూర్ఖుడును అగును

—( ౬ కన్యారాశియందు శనియుండిన )—

చిత్రరువులు వ్రాయుటయందు సమర్థుడును ప్రధాన నాథుడును రక్షణాధికారియును పుత్రహీనుడును లజ్జలేనివాడును ధనములేనివాడును అగును —( ౭ తులారాశియందు శనియుండిన )—

పట్టణస్థులచేతను ప్రజలచేతను సైన్యముచేతను పూజింపబడు వాడును ధనవంతుడు అగును

—[ ౮ వృశ్చికరాశియందు శనియుండిన )—

బంధనతాడనంబుల బొందెడువాడున్ను చంచలచిత్తుడును దయలేనివాడున్ను అగును

—( ౯ ధనూరాశియందు శనియుండిన )—

పరస్త్రీ పరధనములను అనుభవించువాడున్ను రాజగృహమందు నమ్మకమును బొందియుండువాడున్ను మంచిపుత్రులు మంచిపెండ్లాముగల వాడున్ను పట్టణములకు గ్రామములకు సేనలకు ప్రధాన నాయకుడున్ను మంచిమరణమును పొందువాడున్ను అగును

—( ౧౦ మకరరాశియందు శనియుండిన )—

అంత్యకాలమునందు సౌఖ్యమును పొందువాడున్ను పరసేనా గ్రామములకు నాయకుడున్ను మందదృష్టిగలవాడున్ను మలినుడున్ను స్థిరములైన విత్తవైభవములు గలవాడున్ను ధనముకూడబెట్టక అనుభవించు వాడున్ను అగును

—( ౧౧ కుంభరాశియందు శనియుండిన )—

ధనమును కూడబెట్టక అనుభవించువాడు స్థిరములైన విత్తవైభవములు గలవాడున్ను మందదృష్టిగలవాడున్ను అగును

—[ ౧౨ మీనరాశియందు శనియుండిన ]—

పట్టణములకు గ్రామములకు ప్రధాననాయకుడున్ను మంచిపుత్రులు మంచిపెండ్లాముగలవాడున్ను రాజగృహమందు నమ్మకమును పొందు వాడున్ను ధనవంతుడున్ను మంచిమరణమును బొందువాడున్ను అగును

—( దృ ష్టి ఫ ల ము )—

(౧) మేషరాశియందున్న చంద్రునిగాని మేషలగ్నమునుగాని అంగారకుడు చూచుచుండగా బుట్టినవాడు పుడమిరేడగును బుధుడు చూచుచుండగా బుట్టినవాడు పండితుడగును గురుడు చూచుచుండగా బుట్టినవాడు రాజతుల్యుడగును శుక్రుడు చూచుచుండగా బుట్టినవాడు గుణవంతుడగును శనిచూచుచుండగా బుట్టినవాడు దరిద్రుడగును

(౨) వృషభరాశియందున్న చంద్రునిగాని వృషభలగ్నముగాని కుజుడుచూచుచుండగా బుట్టినవాడు దరిద్రుడును బుధుడుచూచుచుండగా బుట్టినవాడు చోరుడును గురుడుచూచుచుండగా బుట్టినవాడు సర్వజన పూజ్యుడును రాజశ్రేష్టుడును శుక్రుడుచూచుచుండగా బుట్టినవాడు రాజును శనిచూచుచుంటగా బుట్టినవాడు ధనవంతుడును రవిచూచుచుండగా పుట్టినవాడు పరిచారకుడు అగును



(3) మిథున రాశియందున్న చంద్రునిగాని మిథునలగ్నమును గాని కుజుడు చూచుచుండగా బుట్టినవాడు శస్త్రముల క్రయవిక్రయాదుల వల్ల జీవనము చేయువాడును బుధుడుచూచుచుండగా బుట్టినవాడు రాజును గురుడుచూచుచుండగా బుట్టినవాడు పండితుడును శుక్రుడుచూచు చుండగా బుట్టినవాడు భయములేనివాడును శనిచూచుచుండగా బుట్టిన వాడు నేతనేయువాడు సూర్యుడుచూచుచుండగా బుట్టినవాడు దరిద్రు డును అగును.

(౪) కర్కటక రాశియందున్న చంద్రునిగాని కర్కటలగ్నమును గాని కుజుడు చూచుచుండగా బుట్టినవాడు కవిత్వము చెప్పువాడును గురు డుచూచుచుండగా బుట్టినవాడు పండితుడును శుక్రుడు చూచుచుండగా బుట్టినవాడు రాజునుశనిచూచుచుండగా బుట్టినవాడుఆయుధముచేజీవించు వాడునురవిచూచుచుండగాబుట్టినవాడు నేత్రవ్యాధి పీడితుడునుఅగును.

(౫) సింహరాశి యందున్న చంద్రునిగాని సింహలగ్నమును గాని బుధుడుచూచుచుండగా బుట్టినవాడు జ్యోతిష శాస్త్రజ్ఞుడును గురు డు చూచుచుండగా బుట్టినవాడు ధనికుడును శుక్రుడు చూచుచుండగా బుట్టినవాడు రాజసమానుడును శనిచూచుచుండగా బుట్టినవాడు మంగల వాడును రవిచూచుచుండగా బుట్టినవాడు రాజును కుజుడుచూచుచుండగా బుట్టినవాడు భూపతియునగును.

(౬)కన్యారాశియందున్న చంద్రునిగాని కన్యాలగ్నమును గాని బుధుడు చూచుచుండగా బుట్టినవాడు పుడమిరేడును. గురుడు చూచు చుండగా బుట్టినవాడు సేనాధిపతియు శుక్రుడుచూచుచుండగా బుట్టినవాడు సకలకార్యములయందును దూరదృష్టిగలవాడును పాపగ్రహములగు రవి కుజశనులచే చూడబడినయెడల స్త్రీనిఆశ్రయించి జీవించువాడునుఅగును.

(౭) తులా రాశియందున్న చంద్రునిగాని తులా లగ్నమును గాని బుధుడు చూచుచుండగా బుట్టినవాడు రాజసమానుడును గురుడు చూచుచుండగా బుట్టినవాడు బంగారుపనిచేయువాడుడు శుక్రుడు చూచు చుండగా బుట్టినవాడు వర్తకుడును మిగిలిన రవికుజులచే చూడబడుచుం డగా బుట్టినవాడు పరకార్యవిముఖుడును అగును.

(౮) వృశ్చికరాశియందున్న చంద్రునిగాని వృశ్చికలగ్నమునుగాని బుధుడు చూచుచుండగా బుట్టినవాడు ఆడపిల్లలకు తండ్రియగును మరియు యిద్దరు తండ్రులుగలవాడును గురుడు చూచుచుండగా బుట్టినవాడు నమ్రుండును శుక్రుడుచూచుచుండగా బుట్టినవాడు నాచాలకుడును శని చూచుచుండగా బుట్టినవాడు దరిద్రుడును కుజుడుచూచుచుండగా బుట్టినవాడు రాజును అగును.

(౯) ధనూరాశియందున్న చంద్రునిగాని ధనుర్లగ్నమును గాని బుధుడు చూచుచుండగా బుట్టినవాడు స్వజనభర్తయు గురుడు చూచుచుండగా బుట్టినవాడు పుడమిరేడును శుక్రుడు చూచుచుండగా బుట్టినవాడు జనులకు ఆశ్రయభూతుడున్ను శనికుజరవులు చూచుచుండగా బుట్టినవాడు డాంభీకుడును పరకార్యవిముఖుడును అగును.

(౧౦) మకరరాశియందున్న చంద్రునిగాని మకరలగ్నమునుగాని బుధుడు చూచుచుండగా బుట్టినవాడు రాజాధిరాజును గురుడు చూచుచుండగా బుట్టినవాడు విద్వాంసుడును శుక్రుడు చూచుచుండగా బుట్టినవాడు విద్వాంసుడును శనిచూచుచుండగా బుట్టినవాడు ధనవంతుడును రవి చూచుచుండగా బుట్టినవాడు పుడమిరేడగును.

(౧౧) కుంభరాశియందున్న చంద్రునిగాని కుంభలగ్నమునుగాని బుధుడుచూచుచుండగా బుట్టినవాడు రాజగును గురుడు చూచుచుండగా బుట్టినవాడు రాజసముడగును శుక్రుడు చూచుచుండగా బుట్టినవాడు పరదారరతుడగును మిగిలిన రవికుజశనులచే చూచుచుండగా బుట్టినవాడు పరస్త్రీ సంసక్తుడగును.

(౧౨) మీనరాశియందున్న చంద్రునిగాని మీనలగ్నమునుగాని బుధుడుచూచుచుండగా బుట్టినవాడు హాస్యరసాభిజ్ఞుండునుగురుడుచూచుచుండగా బుట్టినవాడు రాజును శుక్రుడు చూచుచుండగా బుట్టినవాడు పండితుడును రవికుజశనులచే చూడబడుచుండగా బుట్టినవాడు పాపకర్ముడును అగును.

జాతకబోధిని యందలి ఫలాధ్యాయము సంపూర్ణము.

---

## గ్రహములు (లేక) నక్షత్రములనుగురించి కొంతవరకు ఈదిగువను చెర్చించుచూతము.

గ్రహములన జోతిషమునందు ౯ టిని వాడిరి (అవియేవియనిన) ౧ రవి ౨ చెన్ద్రుడు 3 కుజుడు లేక అంగారకుడు ౪ బుధుడు ౫ గురువు లేక బృహస్పతి ౬ శుక్రుడు ౭ శని ౮ రాహువు ౯ కేతువు మరియు వీటినే నక్షత్రములనికూడానందురు. వీటివిషయమయ్యి క్రైస్తవులు ఒక గొప్పదైనట్టి భూతద్దముద్వారా కనిపెట్టిరి వీటినే మోహమ్మదీయులుస య్యారగాన్ యనియందురు.

సూర్యుడును చంద్రుడును నక్షత్రములును తూర్పునందుబుట్టి ఆకాశమార్గముగా ప్రయాణముచేసి పడమట అస్తమించునని, చాలకాలము నుండి జనులకు తెలిసియుండెను. కొన్ని నక్షత్రములు. ఒక ప్రదేశము చుట్టును మయూకారముగా తిరుగుచు నున్నవిఅనియు తెలియుచున్నది. వీటివలన, దిశలు కనిపెట్టబడినవి. ఇదియుగాక, కాలములయొక్క ప్రమాణమునుకూడ కనిపెట్టుట సంభవించెను. చంద్రగ్రహనియొక్క కాంతి ఎక్కువకావడమునకును క్రమముగా క్షీణించుటకును, 29-30 దినములు కావలయునని జనులకు తెలిసెను. ఈకాలప్రమాణమునకు ఒకనెలఅనుపేరు ఇవ్వబడెను. క్రీ॥ పూ॥ 2500 బ్యాబిలాన్ Babylonians, జనులు నెలను కాలప్రమాణముగాఉపయోగించుచుండిరి. వీరినుండిహీబ్రూస్ Hebr ws గ్రీకులున్ను, రోమనులును, ఈవివరమును తెలుసుకొని రా యూదులు తమ పండుగులను, అమావాస్యపై ఆధారపరచి నడుపుచు నుండిరి. ఇప్పటికినీ క్రీస్తువులు. ఈష్టరు Easter తమ పండుగను ముసన్మానులు రంజాన్ లయొక్క ఉపవాసములను చంద్రునిపై ఆధారపడి ఆచరింతురు.

### సూర్యుడు — ఋతువులు.

ఎండకాలము, చలికాలము సూర్యునిపై ఆధారపడియున్నవి. పూర్వకాలమునందు మనుష్యుడు వ్యవసాయము నేర్చినపుడు భూమిలో విత్తనము వేయుకాలమును తెలుసుకొనుట అత్యావశ్యకమయ్యెను. ఈజిప్ట Egypt దేశములో ప్రతి సంవత్సరము నైలు Nile నది తీరములను ముంచు నిండు ప్రవాహము వచ్చినపుడు ఉచితమైన కాలములో విత్తన

ము వేసినయెడల, మంచిపంట నిచ్చుచుండెను. తర్వాత నక్షత్రములపై ఆ ధారపడి కాలములయొక్క ప్రమాణమును కనిపెట్టుట ఆవశ్యక మాయెను. [ * ] చలికాలములోను మరియు వేడికాలములోను వేరు వేరు నక్షత్రములుకనబడుట జ్యోతిశ్శాస్త్రవిదులగు ఈజిప్టు ఆచార్యులు తెలిసికొనియుండిరి. దీనివల్లసంవత్సరపు దీర్ఘపరిమితినినిశ్చయించిరి.

నక్షత్రములు రేయింబగలునుండును. అయితె సూర్యుని తేజస్సువల్ల అవిపగలుకనబడవు. దూరదర్శక యంత్రమువల్ల కొన్నిప్రకాశమైన నక్షత్రములను చూడగలము అయితె మనుకులో మిక్కిలి ప్రకాశమైన నక్షత్రములను, స్వచ్ఛమైన ఆకాశములో చూడగలము.

౧, ఈజిప్టీయులు, Egyptians ఒక సంవత్సరములో ౩౬౫ దినములు ఉన్నవిఅని కనిబెట్టిరి. తదుపరి, ౩౬౫|౦ దినములు అని నిర్ణయించిరి. యవనులు చంద్రునిబట్టి నెలలను నిర్ణయించుచుండిరి. దీనివలన ఒక సం॥ రములో (౧౨) నెలలు మరియొక సం॥రములో (౧౩) నెలలు వచ్చుచుండెను. దీనివల్ల కలవరపాటు కలుగుచుండెను. గాన ౪౫ కీం॥ పూ॥ లో జూలియస్ శీజరు Julius Cæsar అను సార్వభౌముడు నెలల యొక్క ప్రమాణమును గూర్చి ఒక సం॥ రములో ౩౬౫ దినములు మరియు లీపు leap సం॥ రములో, ( ) ౩౬౬ దినములు వచ్చునటులచేసెను. బ్యాబిలాన్ దేశీయులు అనగా జ్యోతిశ్శాస్త్రజ్ఞులు చాలాశ్రద్ధతో, వారుకనిబెట్టిన విషయములను గ్రంథస్థముచేసినారు. దీనివల్ల గ్రహణములు ౧౮ సం॥ రములు ౧౧ దినముల తర్వాత మళ్ళిమళ్ళి వచ్చునని వ్యక్తపరచినారు.

౨ సూర్యునియొక్క రహస్యములు.

సూర్యుడు చాలావేడిఅయిన వస్తువుఅనియు చాలాదూరములో నున్నాడనియు మనకు తెలిసినవిషయము గెలిలియో Galileo అను శాస్త్రజ్ఞుడు ౧౬౧౦ క్రీ॥ సంరలో సూర్యుడు భూమిమాదిరి, తిరుగుతు నున్నాడనియు, ఒకచుట్టుతిరుగుటకు ౨౭ దినములు కావలయుననియూ కనిపెట్టెను. ౧౬౭౨ క్రీ॥ సం॥ రమున ఫ్రెంచి [ ] శాస్త్రజ్ఞులు,



సూర్యుడు (౯౩౦౦౦౦౦) మైళ్ళదూరములో నున్నాడని, కనిపెట్టిరి. సూర్యునియొక్క వ్యాసము డైమేటర్ (Diameter) (౮౬౫౦౦౦౦) మైళ్లు అవగా, భూమియొక్క వ్యాసమునకంటె ౧౧౦ వంతులు ఎక్కువవ్యాసము ను కలిగియున్నదని నిర్ణయింప గలిగిరి.

న్యూటన్ Newton అను శాస్త్రజ్ఞుడు ప్రతివస్తువులోను ఆకర్షణ శక్తియున్నది అని కనిపెట్టెను భూమియు సూర్యునిచుట్టు తిరుగుటకు ఇదేకారణముసూర్యుడుఈగురుత్వాకరణశక్తివల్లఆకర్షణ(Gravitation) గ్ర్యావిటేషన్ భూమి నాతనిచుట్టు తిరుగునటుల చేయకలిగినాడు.

సూర్యుని యొక్క భారము భూమి యొక్క భారమున కంటె (౩,౩౦,౦౦౦) వంతులు ఎక్కువఉన్నదనియు మరియు సూర్యుని యొక్క పరిమాణము వాల్యూమే (Volume) భూమికంటె ౧౩,౩౧,౦౦౦ వంతు ఎక్కువనున్నదనియూ, కనిపెట్టిరి.

సూర్యునియొక్క పై భాగమువేడి [౬౦౦౦] డిగ్రీలు ఉన్నది. సూర్యుని ఆసాధారణమైన శక్తియుండినందున అనేకకోట్ల సం॥ రముల నుండి వెలుతురు మరియు ఉష్ణము వ్యయము అయిననుకూడా నేటివరకు అదే మోస్తరుగా నున్నాడు సూర్యునియొక్క కేంద్రస్థానములో అనేకలక్షలు డిగ్రీల తీక్షణత యుండును,

# చంద్రుడు

బాలచంద్రుడు క్రమముగా తేజస్సునుపొంది పూర్ణచంద్రుడై తిరిగి క్రమముగా బాల చంద్రుడు అగును ఇది ఎందుకు అనగా చంద్రునికి సూర్యునివలన తేజస్సుకలుగును సూర్యుడు చంద్రుడు మనము ఒకేపంక్తిలో నున్నపుడు పూర్ణచంద్రుని చూచెదము ఆపంక్తినుండి మనము దూరములో నుండినయెడల బాలచంద్రునిగా చూడగలుగుదుము చంద్రుడు కూడాభూమివలెగా గుండ్రముగానున్నాడు హిప్పరుకసు Hipparchus అను గ్రీకు శాస్త్రజ్ఞుడు ౨౦౦ క్రీ॥ పూ॥ సం॥ రములలో చంద్రుడు ౨,౪౧,౦౦౦ మైళ్ళదూరములో నున్నాడని కనిపెట్టెను. అనగా భూమి యొక్క వ్యాసముకంటె ౩౦ వంతులు ఎక్కువగానున్నది. చంద్రు యొ

ము వేసినయెడల, మంచిపంట నిచ్చుచుండెను. తర్వాత నక్షత్రములపై ఆధారపడి కాలములయొక్క పరిమాణమును కనిపెట్టుట అవశ్యక మాయెను. [ * ] చలికాలములోను మరియు వేడికాలములోను వేరు వేరు నక్షత్రములుకనబడుట జ్యోతిశ్శాస్త్రవిదులగు ఈజిప్టు ఆచార్యులు తెలిసికొనియుండిరి. దీనివల్లసంవత్సరపు దీర్ఘపరిమితినినిశ్చయించిరి.

నక్షత్రములు రేయింబగలునుండును. అయితె సూర్యుని తేజస్సువల్ల అవిపగలుకనబడవు. దూరదర్శక యంత్రమువల్ల కొన్ని ప్రకాశమైన నక్షత్రములను చూడగలము అయితె మసుకులో మిక్కిలి ప్రకాశమైన నక్షత్రములను, స్వచ్ఛమైన ఆకాశములో చూడగలము.

౧, ఈజిప్తీయులు, Egyptians ఒక సంవత్సరములో ౩౬౫ దినములు ఉన్నవిఅని కనిపెట్టిరి. తదుపరి, ౩౬౫¼ దినములు అని నిర్ణయించిరి. యవనులు చంద్రునిబట్టి నెలలను నిర్ణయించుచుండిరి. దీనివలన ఒక సం॥ రములో (౧౨) నెలలు మరియొక సం॥రములో (౧౩) నెలలు వచ్చుచుండెను. దీనివల్ల కలవరపాటు కలుగుచుండెను. గాన ౪౫ క్రీ॥ పూ॥ లో జూలియస్ శిజరు Julius Cæsar అను సార్వభౌముడు నెలలయొక్క ప్రమాణమును గూర్చి ఒక సం॥ రములో ౩౬౫ దినములు మరియు లీపు leap సం॥ రములో, ( ) ౩౬౬ దినములు వచ్చునటులచేసెను. బ్యాబిలాన్ దేశీయులు అనగా జ్యోతిశ్శాస్త్రజ్ఞులు చాలాశ్రద్ధతో, వారుకనిబెట్టిన విషయములను గ్రంథస్థముచేసినారు. దీనివల్ల గ్రహణములు ౧౮ సం॥ రములు ౧౧ దినముల తర్వాత మళ్ళిమళ్ళి వచ్చునని వ్యక్తపరచినారు.

౨ సూర్యునియొక్క రహస్యములు.

సూర్యుడు చాలావేడిఅయిన వస్తువుఅనియు చాలాదూరములో నున్నాడనియు మనకు తెలిసినవిషయము గెలిలియో Galileo అను శాస్త్రజ్ఞుడు ౧౬౦౮ క్రీ। సం రలో సూర్యుడు భూమివలెనే, తిరుగుతు నున్నాడనియు, ఒకచుట్టుతిరుగుటకు ౨౭ దినములు కావలయుననియూ కనిపెట్టెను. ౧౬౭౨ క్రీ। సం॥ రమున ఫ్రెంచి [ ] శాస్త్రజ్ఞులు.



సూర్యుడు (౯౩౦౦౦౦౦) మైళ్ళదూరములో నున్నాడని, కనిపెట్టిరి. సూర్యునియొక్క వ్యాసము డైమేటర్ (Diameter) (౮౪౦౦౦౦) మైళ్లు అనగా, భూమియొక్క వ్యాసమునకంటె ౧౧౦ వంతులు ఎక్కువవ్యాసమును కలిగియున్నడని నిర్ణయింప గలిగిరి.

న్యూటన్ Newton అను శాస్త్రజ్ఞుడు ప్రతివస్తువులోను ఆకర్షణ శక్తియున్నది అని కనిపెట్టెను భూమియు సూర్యునిచుట్టు తిరుగుటకు ఇదేకారణముసూర్యుడుఈగురుత్వాకరణశక్తివల్లఆకర్షణ(Gravitation) గ్ర్యావిటేషన్ భూమి నాతనిచుట్టు తిరుగునటుల చేయకలిగినాడు.

సూర్యుని యొక్క భారము భూమి యొక్క భారమునకంటె (౩,౩౦,౦౦౦) వంతులు ఎక్కువఉన్నదనియు మరియు సూర్యుని యొక్క పరిమాణము వాల్యూమే (Volume) భూమికంటె ౧౩,౩౧,౦౦౦ వంతులు ఎక్కువనున్నదనియూ, కనిపెట్టిరి.

సూర్యునియొక్క పై భాగమువేడి [౬౦౦౦] డిగ్రీలు ఉన్నది. సూర్యుని ఆసాధారణమైన శక్తియుండినందున అనేకకోట్ల సం॥ రముల నుండి వెలుతురు మరియు ఉష్ణము వ్యయము అయిననుకూడా నేటివరకు అదే మోస్తరుగా నున్నాడు సూర్యునియొక్క కేంద్రస్థానములో అనేకలక్షలు డిగ్రీల తీక్షణత యుండును,

## చంద్రుడు

బాలచంద్రుడు క్రమముగా తేజస్సునుపొంది పూర్ణచంద్రుడై తిరిగి క్రమముగా బాల చంద్రుడు అగును ఇది ఎందుకు అనగా చంద్రునికి సూర్యునివలన తేజస్సుకలుగును సూర్యుడు చంద్రుడు మనము ఒకేపంక్తిలో నున్నపుడు పూర్ణచంద్రుని చూచెదము ఆపంక్తినుండి మనము దూరములో నుండినయెడల బాలచంద్రునిగా చూడగలుగుదుము చంద్రుడు కూడాభూమివలెగా గుండ్రముగానున్నాడు హిప్పరుకసు Hipparchus అను గ్రీకు శాస్త్రజ్ఞుడు ౨౦౦ క్రీ॥ పూ॥ సం॥ రములలో చంద్రుడు ౨,౪౧,౦౦౦ మైళ్ళదూరములో నున్నాడని కనిపెట్టెను. అనగా భూమియొక్క వ్యాసముకంటె ౩౦ వంతులు ఎక్కువగానున్నది. చంద్రు యొ

క్క వ్యాసము ౨,౧౬౦ మైళ్లు అనగా భూమియొక్క వ్యాసములో పాతి కభాగము ఉన్నది. చంద్రునియొక్క భారము భూమియొక్క భాగములో ౮౦ లో ఒకభాగము నున్నది. చంద్రునియొక్క పైభాగమునందు గురుత్వాకరణశక్తి భూమియొక్క గురుత్వాకరణశక్తిలో ౬ లో వకభాగము నున్నది. చంద్రమండలములో పర్వతములునున్నవి. ఐతే నీళ్ళు మరియు గాలిలేదు. అందువల్లనే చంద్రమండలముపై మేఘములులేవు. ఒకానొకప్పుడు గాలి, యుండియుండవచ్చును గురుత్వాకరణశక్తి చాలా తక్కువగ నున్నందువలన గాలిఅంతయూ, అచటనుండి తప్పించుకొనెను. చంద్రమండలములో గాలిలేనందున, పగటిపూట చాలవేడిగాను రేయి చాలాశీతముగాను నుండును. చంద్రమండలములో అగ్నిపర్వతములు జ్వాలాముఖులు చాలఉన్నవి. చంద్రుడు తనముఖమును ఎల్లప్పటికి మనతట్టు చేసియుంటాడు మరియు భూమి చుట్టూరున తిరుగుటకువక నెలఅగును. ఒకానొక కాలమునందు చంద్రుడు ద్రావకరూపములో నుండెనని కొందరి యభిప్రాయము.

## గ్రహములు

పూర్వపు శాస్త్రజ్ఞులు గ్రహములను నక్షత్రములుగా భావించుచుండిరి. శుక్రుడు రేయింబగలు ఒక ఒక సారి కనబడుతాడు. ఇదిగాక అన్నిగ్రహములకంటె చాలా తేజస్సుగల గ్రహము శుక్రునికి యవన శాస్త్రజ్ఞులు రెండుపేర్లు ఇచ్చియుండిరి. పగట శుక్రునికి "ఫాసుపెరసు" Phosphorus మరియు రాత్రిశుక్రునికి "హెసుపెరసు" Hesperus అయితే "పైథాగిరెసు" Pythagoras అనుశాస్త్రజ్ఞుడు క్రీ॥ పూ॥ ౫౦౦ సం॥ రములో ఇవిరెండు ఒకేనక్షత్రమని కనిబెట్టెను. బుధుడు మరియు శుక్రుడు సూర్యునిచుట్టూరుతూ గాడినట్టుకనబడును ఏలఅనగా ఈగ్రహముల గ్రహపథము భూమియొక్క గ్రహపథములోపలనున్నవి. సూర్యుడు కూడ ఆకాశములో ఒకవర్తులములో తిరుగును కుజుడుతనఎరుపువన్నెవల్ల గుర్తింపబడుతాడు. కాంతిలో శుక్రునితర్వాత గురువు.



గ్రహములచారముపూర్వక శాస్త్రజ్ఞులకు దిగ్భ్రమకలుగజేసి యుండెను. ఎందుకనగా, వారుసూర్యుడు భూమిచుట్టూరుతిరుగుననిఅభిప్రాయపడుచుండిరి.

కుజ, గురు, శని, ఈగ్రహములు, సహజముగా పశ్చిమమునుంచి తూర్పుదిక్కు సంచారము చేయుచుండును. ఇట్లుచేసి కొన్నిదినములు స్థిరముగా నుండి మరల పూర్వమునుండి పరమటికి ప్రయాణమొసగును. తర్వాత కొన్నిదినములు స్థిరముగానుండి మరల పడమటినుండి తూర్పుకు ప్రయాణమొసగును. ఇది ఎట్లనగా భూమియు మరియు ఇతరగ్రహములు సూర్యుని చుట్టూరుఒకేదిక్కున ప్రయాణము చేయుచుండును. సూర్యుని చుట్టూ భూమితిరిగే గ్రహపథమునకంటె గురువు నిగ్రహపథము ౫ వంతున ఇదియుగాక సూర్యునిచుట్టూ గురువు తిరుగుటకూ ౧౨ వర్షములు కావలయును. గురువుకు మరియుసూర్యునికి మధ్యనభూమియుప్రతి 1 1/11 వర్షమునుండును. ఆసమయమునకు గురువు మనకు ఎదురుగా నుండును. మరియు చాలాదగ్గర, కుజుడు మనకుదగ్గర నున్నందున [2] సంవత్సరములు 2 నెలలకు వకసారి మనకు ఎదురుగానుండును. ఆకాశములో సూర్యగమన మార్గము కనిపెట్టుట కష్టము అది ఒకగొప్పవర్తులము ఈక్రాంతి వృత్తముపైననే సూర్యచంద్ర గ్రహణములు అగును.

## గ్రహములు

పూర్వపు శాస్త్రజ్ఞులు గ్రహములను తిరుగేనక్షత్రములని భావించుచుండిరి. గెలిలియో, Galileo అనుశాస్త్రజ్ఞుడు తనదూరదర్శక యంత్ర సహాయమువలన ఈతిరుగూడ నక్షత్రములు చుక్కలు కావనియు వీటికి బింబములు కలవనియు కనిపెట్టెను. శుక్రుడు అర్ధచంద్రాకృతిగలవాడు మరియు ప్రతిబింబించిన కాంతివల్ల ప్రకాశించుననియు గురువుకు నాల్గుచంద్రులు (ఉపగ్రహములు) గలరు. ఇవిగురువుచుట్టూరుతిరుగుటయు కాక గురువువెంబడి తిరుగుననియూ, ఈవిధముగా గ్రహములుభూమివలె గొప్ప ఆకారములనియూ సూర్యుని చుట్టూరు సంచరించుచున్నవనియు

కనిపెట్టెను. ఇతనితర్వాత న్యూటన్ Newton అనుశాస్త్రజ్ఞుడు సర్వత్ర వ్యాపించిన గురుత్వాకర్షణశక్తిని కనిపెట్టెను.

ఈక్రిందపట్టివల్ల గ్రహముల కొన్నివిషయములు తెలియ నగును.

| గ్రహములు. | సూర్యునినుంచి ఉండుదూరము | సూర్యునిచుట్టూరుతిరుగుటకు కావలసినదినములు | పరిమాణము |
|---|---|---|---|
| బుధుడు— | 4 కోట్లమైళ్లు | 88 దినములు | .0 4 |
| శుక్ర— | 6.7 ,, | 225 , | .8 |
| భూమి — | 9.3 ,, | 1 వర్షము | 1.0 |
| కుజుడు— | 14 ,, | 1.9 ,, | .11 |
| గురువు— | 48 ,, | 11.8 ,, | 317 |
| శని— | 89 ,, | 29.5 | 95 |

బుధుడు— ఈగ్రహమునందు గాలి ఉన్నట్లుకనపడదు. సూర్యునికి చాలా దగ్గరగా నున్నందున చాలావేడిగా నుండును. ఈ వేడివల్లనే గాలి అంతయూ తప్పించుకొని పోయినది. సదాకాలములో సూర్యునికి ఏకేముఖమునుచేసి వానిని 88 దినములలో చుట్టి వేయును అనేకవిషయములలో బుధుడు చంద్రుని పోలును.

శుక్రుడు—దీనికివ్యతిరేకముగా శుక్రుడు గాఢమైన మేఘములతో కప్పబడియున్నాడు. వీనివల్లసూర్యుని ఉష్ణము మంతయు దానిపై సదరు దానిఆకారము చాలామట్టుకు భూమివతుగానే యున్నవి, ఆమ్లజనకము మరియు నీటిఆవిరి లేనందున అచట జీవించుటకు కాదు.

కుజుడు— ఈగ్రహమునకు రెండు ఉపగ్రహములు కలవు ఈగ్రహములో ప్రథమరూపజీవము జీవించవచ్చును. ధృవముః వద్ద తెల్లమచ్చలు చలికాలమున కనబడును. వేడికాలములో అవి అదృశ్యములగును, బహుశః ఇదిమంచుగడ్డ అయియుండవచ్చును. మరియు మంచుయొక్క కప్పు యెక్కువ మందముగాలేదు.



గురు— (బృహస్పతి) ఇదిచాలా గొప్పగ్రహము దీనిచుట్టూరు 5, చంద్రులు మరియు అనేక ఉపగ్రహములు ఉన్నవి ఈగ్రహము తన అక్షముపై 10, ఘంటలలో తిరుగును. దీని శీతోష్ణస్థితి చాలాతక్కువ అమోనియా మార్షుగ్యాసు అనువాయువలతో గాఢముగా కప్పబడియున్నవి ఈకప్పులోపలి అగాధమైన మంచుగడ్డ నున్నదని తెలియవచ్చినది.

శని—ఈగ్రహములో వక విశేషముగలదు. ఒకప్రకాశమైన ఉంగరము దీనిచుట్టూరునున్నది. ఇదిచాలాచిన్నది. దీనిలో అనేక వస్తువులు చేరియున్నవి. ఇవన్నియు ఈగ్రహము చుట్టూరుతిరుగును. ఈవుంగరముయొక్క లోభాగము వెలపటిభాగముకంటెత్వరగా తిరుగును దూరదర్శక యంత్రమువల్లనూ గణితశాస్త్రమువల్లనూ యీవిషయములేకాక ఈగ్రహమునకు అనేక ఉపగ్రహములును లేవనియూ తెలియవచ్చినది. గురువువల్లనే ఇదిచాలా చల్లటి గ్రహము మరియు అమోనియామార్షుగ్యాస్. అనువాయువులు గాఢమైనకప్పుతో కప్పబడియున్నది.

యురేనస్ Uranus 1781 క్రీ॥ శ॥ సర్‌విలియం హెరుశల్ Sir William Herschel అనుపండితుడు ఈగ్రహము సూర్యుని నుండి 178 కోట్ల మైళ్లదూరములో నున్నది గురు శనుల మాదిరి ఈగ్రహము చాలాచల్లనిది దీనికి నాల్గు ఉపగ్రహములు నున్నవి.

నెప్ట్యూన్ Neptune ఈగ్రహము 1846 ఈసలీలో కనిబెట్టబడెను. కనిపెట్టినవారు ఆడంస్ లెవెరెర్ Leverrier's ఇది 280 కోట్ల మైళ్ళ సూర్యునినుంచి దూరముగా నున్నది సూర్యుని ఒకసారి చుట్టి చేయుటకు 160 వర్షములు కావలయును దీనివ్యాసము భూమివ్యాసము కంటె నాల్గవంతులుఎక్కువ ఇతరవిషయములలో గురువు శని గ్రహములతో చాలాపోలుతుంది దీనికి మనచంద్రునివంటి పెద్ద ఉపగ్రహముకలదు. ప్లూటో, Pluto టాంబో అను యువకశాస్త్రజ్ఞుడు ఈగ్రహమును కనిపెట్టెను దీనికి కాంతిచాలా తక్కువ కుజ, గురువుల మధ్య చాలాసందుమున

కనిపెట్టెను. ఇతనితర్వాత న్యూటన్ Newton అనుశాస్త్రజ్ఞుడు సర్వత్ర వ్యాపించిన గురుత్వాకరణశక్తిని కనిపెట్టెను.

ఈక్రిందపట్టివల్ల గ్రహముల కొన్నివిషయములు తెలియ నగును.

| గ్రహములు. | సూర్యునినుంచి ఉండుదూరము | సూర్యునిచుట్టూతిరుగుటకు కావలసినదినములు | పరిమాణము |
|---|---|---|---|
| బుధుడు— | 4 కోట్లమైళ్లు | 88 దినములు | .04 |
| శుక్ర— | 6.7 ,, | 225 , | .8 |
| భూమి— | 9.3 ,, | 1 వర్షము | 1.0 |
| కుజుడు— | 14 ,, | 1.9 ,, | .11 |
| గురువు— | 48 ,, | 11.8 ,, | 317 |
| శని— | 89 ,, | 29.5 | 95 |

బుధుడు— ఈగ్రహమునందు గాలి ఉన్నట్లుకనపడదు. సూర్యునికి చాలా దగ్గరగా నున్నందున చాలావేడిగా నుండును. ఈ వేడివల్లనే గాలి అంతయూ తప్పించుకొని పోయినది. సదాకాలములో సూర్యునికి ఒకేముఖమునుచేసి వానిని 88 దినములలో చుట్టి వేయును అనేకవిషయములలో బుధుడు చంద్రుని పోలును.

శుక్రుడు—దీనికివ్యతిరేకముగా శుక్రుడు గాఢమైన మేఘములతో కప్పబడియున్నాడు. వీనివల్లసూర్యుని ఉష్ణము మంతయు దానిపై సదరు దానిఆకారము చాలామట్టుకు భూమివతుగానే యున్నవి. ఆమ్లజనకము మరియు నీటిఆవిరి లేనందున అచట జీవించుటకు కాదు.

కుజుడు— ఈగ్రహమునకు రెండు ఉపగ్రహములు కలవు ఈగ్రహములో ప్రథమరూపజీవము జీవించవచ్చును. ధృవముః వద్ద తెల్లమూతలు చలికాలమున కనబడును. వేడికాలములో అవి అదృశ్యములగును, బహుశః ఇదిమంచుగడ్డ అయియుండవచ్చును. మరియు మంచుయొక్క కప్పు యెక్కువ మందముగాలేదు.



భూమియు సూర్యునినుంచి 9,300000 లక్షలమైళ్లనున్నది. సం॥రంలో ఏభాగములోనైనను 930 లక్షలమైళ్ళదూరములోనుండును. ఈ స్థలమునుండి 6 నెలలతర్వాత 1860 లక్షలమైళ్ళ దూరములోనుండును. గాన సమీపములోనున్న నక్షత్రములస్థానము మారినట్లగుపడును. ఒక (శతాబ్దము) శతమానము క్రిందట బెసలు Bessel అను శాస్త్రజ్ఞుడు "61 సిగ్నీ" Cygni అను నక్షత్రమునకు మనకు వుండే దూరమును కనిపెట్టెను. ఇదిచాలాఎక్కువ కలిగినదికాదు. అయితే చాలావేగముతో సంచరించును. మనకుదీనికి దూరము సూర్యునికంటె 7 లక్షలవంతుఎక్కువ అనికనిపెట్టెను. ఒకసంవత్సరముతర్వాత 'శెంటవురి' అను నక్షత్రమునకు మనకు సూర్యునికంటె 2 లక్షల వంతుఎక్కువఅని హెండరుసన్ అనువాడు కనిపెట్టెను. ఆనక్షత్రములు అపారమైనదూరములో నున్నందున ఈదూరమును "వెలుతురు సం॥రము"లో గుర్తించెదరు ఒక "వెలుతురు సం॥రము" అంటె వకసం॥రములో వెలుతురు ప్రయాణముచేసేదూరము అనగా మనకు సూర్యునికి నుండుదూరము కంటె 70 వేలువంతు ఎక్కువ వెలుతురు వకనిమిషములో 110 లక్షలమైళ్లు మనకుచాలా దగ్గఱనుండు నక్షత్రము "4-2 వెలుతురు సం॥రము" దూరములో నున్నది. సూర్యుని తేజస్సును నక్షత్రముల తేజస్సుతో పోల్చవచ్చును. సరియస్ Sirius ఆకాశములో అన్నిటికంటె ఎక్కువ తేజస్సుకల్గినవి. దానినుండి మనకు వచ్చె వెలుతురు కంటె సూర్యుని వెలుతురు 2000 కోట్ల వంతు ఎక్కువ అయితే ఆచుక్క తొమ్మిది "వెలుతురు సం॥రములు" దూరములో నున్నది. ఆచుక్క సూర్యుడుండే స్థలములో నుండినయెడల సూర్యునికంటె 27 వంతు అధిక తేజస్సును నిచ్చును. కొన్ని నక్షత్రములు ధృవముగా నున్నవి. కొన్ని నక్షత్రములు యితర నక్షత్రములు సూర్యునికంటె వేలుల వంతు ఎక్కువపరిమాణముగాను కొన్ని 1000 లో నొకభాగము కలవియైయున్నవి కొన్ని నక్షత్రములు ధృవముగానున్నవి. కొన్ని నక్షత్రములు ఇతరనక్షత్రముల చుట్టూతిరుగును. దీనికి కారణము సర్వవ్యాపితమగు గురుత్వాకరణశక్తియే ఇట్లుచుట్టివేయుటకు కొన్నిచుక్కలకు కొద్ది సం॥రములు కావలయును. మరికొన్నిటికి నూర్ల సం॥రములు కావలయును.

ఒకకొన్ని నక్షత్రములు భూమినుండి నుండేదూరము తెలిసిన యెడల ఆనక్షత్రముల మధ్యలనుండు దూరమును కనిపెట్టవచ్చును ఒక చుక్కకు నింకొకచుక్కకు నుండుదూరమును కనిపెట్టవచ్చు చుక్కలు చుట్టివేయుటకు కావలసిన కాలము తెలసినయెడల వీటియొక్క పరిమాణమును చరూపును తెలియవచ్చును.

నక్షత్రములవన్నె వేరువేరుగా నుండును కొన్నిపసుపువన్నె కొన్ని ఎరపువన్నె కొన్ని తెల్లగానుండును. ఈవన్నెలు నక్షత్రముల ఉష్ణతను తెలియవలెను. ఎర్రవన్నె నక్షత్రముల పై భాగము 350 డిగ్రీలు "సెంటిగ్రేడు" Centigrade పసుపువన్నె చుక్కలు ఆరువేలు డిగ్రీలు సె॥ తెల్లవి 12 వేల దిగ్రీలు సె॥ మరియు దీనికి అధికముగాను ఉష్ణత యున్నట్లు తెలియచేయును. సూర్యునిలో నున్నట్లు ఈవేడి నక్షత్రముల కేంద్రస్థానమునకు పోయినట్లెల్ల తెల్లగా ఎక్కువగును కేంద్రములో అనేక లక్షల డిగ్రీల ఉష్ణతయుండును. అణువులో అనంతమైన శక్తియున్నదని శాస్త్రజ్ఞులు కనిపెట్టినారు గాన నీనక్షత్రముల నుండి ప్రతిక్షణముఎంతో శక్తి వెలుతురా మరి వేడిరూపములో పోవుచుండెను ఇదివరకు అవిప్రకాశముగానే యున్నవి.

సృష్టిలో నక్షత్రములు ప్రకృతియొక్క కారణమువల్ల వచ్చియుండవచ్చును. నక్షత్రములు ఆరంభదశలో ఎర్రవన్నెకలిగి సూర్యునికంటె అపారమైన పరిమాణముకలిగి యుండును. వీటివ్యాసము సూర్యుని వ్యాసముకంటె 100 వంతులు ఎక్కువ అయితె దీనిప్రకృతాంశము సూర్యునికంటె 10 వే వంతులు ఎక్కువ నుండును.

ఇట్లు యెర్రగానుండు నక్షత్రము క్రమముగా ముడుచుకొనును సన్నగా అయినకొల్లలకాంతి అధికమై తెల్లతేక నీల్లి నక్షత్రమగును. ఇటులనే సన్నగ అయినకొద్ది ఉష్ణముతగ్గుచు పోవును. ఇట్లుతగ్గినకొల్లల నక్షత్రవన్నె పసుపు తర్వాత ఎరు[illegible] సన్నమైన ఎర్రనక్షత్రము సూర్యునికంటె [illegible] నుండును.

